# శ్యాం నాటికలు

తెలుగు నాటకరంగ

శతవార్షికోత్సవ కానుకగా

స్పందన సాహితీ సమాఖ్య ప్రచురణ

బూదరాజు శ్యామసుందర్

# SYAAM NAATIKALU

*Play-lets by*

BUDARAJU SYAMASUNDAR



**Spandana Saahithee Samaakhya**

**Publication No : 29**

**February 1981**

**RUPEES TEN**

Title Design by Litho Krishna Moorthy

Printed at National Press, Machilipatnam

*For Copies :*

Budaraju Syamasundar
Andhra Scientific Co.,
Machilipatnam–521 001

Spandana
Saahithee Samaakhya
26-162, Buttaipet
Machilipatnam



# ఇదీ స్పందన

తెలుగు దేశంలో బతికి బట్టకట్టిన బహు కొద్ది సాహితీ సంస్థల్లో 'స్పందన సాహితీ సమాఖ్య' ఒకటి।

పదకొండేళ్ళ క్రితం అతి సామాన్యంగా ప్రారంభింపబడి, నేటికి తనదంటూ ఒక ప్రత్యేకతను సంతరించుకున్న సంస్థ 'స్పందన'!! తన 29వ ప్రచురణగా వెలువరిస్తున్న ఈ "శ్యాం నాటికలు"తో వివిధ సాహిత్య ప్రక్రియలూ ప్రచురించామన్న తృప్తిని పొందుతోంది స్పందన సాహితీ సమాఖ్య!!!

మా కార్యక్రమాలన్నింటికీ అండగా నిలుస్తున్న ఎందరో మహానుభావులు! అందరికీ అభివందనాలు!!

తన నాటికల సంపుటిని స్పందన ప్రచురణగా వెలువరిస్తున్న శ్రీ బూదరాజు శ్యామసుందర్ కీ, అందంగా అచ్చొత్తిన నేషనల్ ప్రెస్ వారికీ స్పందనాభినందనలు.

స్పందన సాహితీ సమాఖ్య రిజిస్టర్డ్

# నాకు తోచింది...

సాహిత్యంలో నాటకం వ్రాయడం ఆఖరి ప్రక్రియ. నటహృదయంగల కవి వ్రాసిన నాటకం కవి హృదయంగల నటుడు నటించినప్పుడే ఆ నాటకం రక్తి కడుతుంది. రసభరిత నవనవోన్మేషణ కావ్యం అవుతుంది. రసవత్తర సంకలన మవుతుంది. విభిన్న మనస్తత్వాల పరస్పర సంఘర్షణయే జగన్నాటక మవుతుంది.

మిత్రుడు శ్రీ బూదరాజు శ్యామసుందరరావు నట హృదయంగల రచయిత. మంచి నాటకాలు, నాటికలు వ్రాయగల సమర్థుడు. నాటకంలో "నాటకీయతను" పరిపోషించడమేగాక సంభాషణల చిత్రణలోకూడా నాట కీయతను కల్పించి "నాటకం" అనే పదానికి అర్థాన్ని చెప్పగల చేయి తిరిగిన నాటక రచయిత అని చెప్పక తప్పదు.

మొదటి నాటిక "నాలుగు స్థంభాలాట". నాటిక ప్రారంభం నుంచి రామ్, కిరణ్‌ల మధ్య చాలాసేపు సంభాషణలు జరుగుతాయి, ఆ సంభాషణలలో ఆ రెండు పాత్రల ఆశయాలు అర్థమవుతాయి. ఆధునిక మానవ సమాజంలో పాపపంకిలం మొదలు అభ్యుదయ భావాల వరకు ఆ సంభాషణలు పరుగులు తీస్తాయి.

కిరణ్ నిష్క్రమించగానే శశి ప్రవేశిస్తుంది. వారిద్దరిమధ్య సంభాషణలు ప్రారంభమవుతాయి. అతనిలో చలనం కలుగుతుంది. ఉత్సాహం ఉరకలు వేస్తుంది. ఉపజ్ఞ తొంగి చూస్తుంది. వెంటనే లేచి అసంపూర్తిగా వున్న చిత్రాన్ని కుంచె చేతబట్టి పూర్తి చేస్తాడు. ఆ చిత్రాన్ని చూసి శశికళ మురిసి మెరసి పోతుంది. పూర్తి కాని చిత్రాన్ని శశికళ రాగానే "మూడ్సు" తెచ్చుకొని పూర్తి చేశాడు. అదే రామ్ ఆనందం.

కళాకారునిలో నిబిడీకృత్మైన అనంత కళను బహిర్గతం చేయడానికి కళాకారుని కుదిలించి, కదిలించడానికి సంఘటనలు సృష్టించడమే యీ నాటిక ప్రధాన ఉద్దేశం. ముగింపు నాలుగు స్థంభాల ఆటగానే ముగిసింది.

రెండోది, "స్టూడెంట్ రూమ్". నాటిక ప్రారంభంలో యిద్దరి మీదనే కధ కొంతసేపు నిలిచినా హాస్య సంభాషణల వల్ల విసుగు పుట్టదు. సస్పెన్సుతో కధ ముగుస్తుంది. రచనా విధానంలో కొత్తదనం గోచరించింది. తండ్రి నుంచి టెలిగ్రాం రావడం, అది అందిన వెంటనే తండ్రి రావడం అంతగా బావుండలేదేమో। అయితే టెలిగ్రాం అందగానే రూమ్ శుభ్రపరచే ఆతృతలో కొంత హాస్యం ద్యోతక మవుతుంది. ఈ నాటికలో ప్రేక్షకులలో నుంచి ఒకరు రంగస్థలం మీదకు రావడం మరో విశేషం.

మూడో నాటిక "ప్రేమ చెల్లించిన మూల్యం" ఈ నాటికను చదవడం ప్రారంభిస్తే పూర్తిగా చదవకుండా వుండలేము. చక్కని సాహిత్యాన్ని చిక్కగా అందించారు రచయిత. మహాకవిగా అశ్వఘోషుని పాత్రను, ప్రభాదేవి పాత్రను ఊహాకందని విధంగా కళాత్మకంగా చిత్రించారు రచయిత. ప్రదర్శన కన్నా చదవడానికి మాత్రమే ఉత్తమంగా వుంది. రేడియో నాటికకు అన్ని విధాలా ఉపయుక్తం కాగలదు. దీనిలో రచయిత కన్పించారు. నాటకంలో రచయిత కన్పిస్తే అది చదవడానికి మాత్రమే పనికి వస్తుంది.

నాలుగో నాటిక "బహిష్కారంతో .... పరిష్కారం" ఇది తొమ్మిది పేజీల నాటిక. ఇది అతి చిన్నదే అయినా "ప్రకృతి సౌందర్యాగాధాల లోతులు పరికిస్తున్నాను. రీతులు చిత్రిస్తున్నాను." ఇలాటి సంభాషణలు ఎన్నో వున్నాయి.

భిక్షు, అధికారి ప్రాత్రల మధ్య జరిగే సంభాషణలు భావగర్భితంగా వున్నాయి. చిత్రకారుని ఆలోచన, భావం, ఆశయం వెలుగులోనికి వస్తాయి.

ఐదో నాటిక "మోహినీ భస్మాసుర". నృత్య రూపకం. శాస్త్రీయంగా, సంప్రదాయకంగా అపూర్వంగా వ్రాయబడినది. సాంఘిక నాటకాలు, నవలలు, కథానికలు వ్రాసే శ్రీ శ్యామసుందరరావు ఇలాటిది వ్రాయడం సాహసమే అయినా తన ఆశయాన్ని సాధించుకున్నారు.

భాష మీద తనకువున్న అధికారాన్ని మరోసారి మన సాధికారంగా రుజువు చేసుకున్నారు.

భావాలు అందరికీ వుంటాయి. కాని భాష వుండదు. శ్రీశ్యామసుందరరావులో భాష-భావం పందెం వేసుకుని పరుగులు తీస్తాయి.

సామాజిక జీవితాలను వ్యక్తిత్వాలను యథాతథంగా చిత్రించి చదువరి గుండెలలో అవ్యక్త మాధుర్యంతోపాటు అగ్ని కణాలను సృష్టించగల సమర్థుడు మన బూదరాజు.

కళా రంగంలో, ముఖ్యంగా సాహితీ రంగంలో మిత్రుడు శ్రీ బూదరాజు శ్యామసుందరరావుకు ఉజ్వలమైన భవితవ్యం వుంది.

ఆయన కలంనుంచి సమాజానికి సందేశాలనిచ్చే రచనలు పుంఖానుపుంఖంగా వెలువడాలని ఆశిస్తున్న-

విడియాల చంద్రశేఖరరావు

# నేనుగా చెప్పుకొనేది...

ఈ సంపుటిలోని నాటికలు విభిన్న రీతులకు, విభిన్న కాలాలకు చెందినవి. రచనగూడా అలాగే ఒక బిగిన చేసిందికాదు. బాగోగులు సహృదయుల అభిప్రాయాలు నాకు తెలియజేస్తే సంతోషిస్తాను. అలాగే ప్రదర్శకుల విమర్శలనుగూడా ఆహ్వానిస్తు న్నాను.

మిత్రుల ప్రేరణపై అక్కడక్కడ పడివున్న ఈ నాటికలను గుదిగ్రుచ్చి వెలుగులోకి తెచ్చాను. మిగతా నాటికలుగింటినీ అలా వుంచి నృత్యనాటిక "మోహినీ భస్మాసుర" గురించి నాలుగు మాటలు చెప్పాల్సివుంది. నా జన్మస్థలం ప్రకాశంజిల్లా వేటపాలెంలో ఒక నృత్య పాఠశాల నెలకొల్పే ప్రయత్నం చేశాను. శ్రీ వేదాంతం రామకృష్ణ (రామచంద్రన్) అనే వృద్ధ కూచిపూడి నర్తకుని ప్రేరణతో-ఆయన కోరికమీద-ప్రదర్శనకోసం ఈ నాటిక వ్రాశాను. సంగీత నృత్యాల్లో నాకు అభిరుచేగాని, అభినివేశం, పాండిత్యం అత్యల్పం. కవిగా ఛందోరీతులు నా కంతగా వంటబట్టినవికావు. అయినా నేను వ్రాయడం, కొంత నృత్యపాఠశాలా విద్యార్థులు సాధన చేయడం జరిగింది. చివరకు ప్రదర్శన జరగ లేదు — నాట్యాచార్యులు ఎక్కడికో వెళ్ళిపోవడంతో!

రచనా కాలంలో నాకు తగు సహాయ సహకారాలందించిన వృద్ధ హార్మోనిస్టు శ్రీ కర్ణ వాసుదేవరావుకు, ప్రచురణకు ముందుగా నాటిక చదివి సలహా లందించిన శ్రీ చిరువోలు లక్ష్మణరావు (హార్మోనిస్టు) లకు నా కృతజ్ఞతలు. ఓపికగా నా చిత్తు ప్రతిని చక్కగా మేలిప్రతిగా తయారించిన ప్రాయసకాడు, నా సహోదరుడు చి॥ మదన మోహన్‌కు నా ఆశీస్సులు. నాటికల ప్రచురణకు ప్రోత్సహించిన మిత్రులు శ్రీ చిత్రపు మాధవరావు, శ్రీ రావి రంగారావు గార్లకు నా మనఃపూర్వక అభివాదాలు.

నాటికల సంపుటి ప్రచురణ కంగీకరించిన 'స్పందన సాహితీ సమాఖ్య' మిత్రులకు, ఇతోధిక ఆర్థిక హార్దిక సహకారాలందించిన శ్రీ పెదబాబు, శ్రీ గంజాం శ్రీహరి రావు, శ్రీ వి. బి. ఎల్. నారాయణమూర్తి, శ్రీ జి. వి. పూర్ణచందు, శ్రీ చలమలశెట్టి శేషగిరిరావు తదితర పెద్దలకు కృతజ్ఞతాభివందనములు.

వీటన్నిటికంటే మిన్నగా వెన్నుతట్టి అండగా నిలిచిన మిత్రుడు గుత్తికొండ సుబ్బారావుకు, తమ అమూల్యాభిప్రాయాన్ని అందించిన శ్రీ విడియాల చంద్రశేఖరరావుకు నా నమోవాకాలు.

బూదరాజు శ్యామసుందర్

# నాలుగు స్తంభాలాట

( సాంఘికం )

ఆంధ్ర పత్రికాధిపతుల సౌజన్యంతో



స్నేహశీలి, సారస్వత ప్రియుడు,

ఆప్తుడు — సహాధ్యాయి

మిత్రులు

**శ్రీ పన్నెం పెదబాబుకు**

కృతజ్ఞతా పురస్సరంగా సమర్పితం

బూదరాజు శ్యామసుందర్

మూలం :— ఒక జర్మన్ సామెత.

వచ్చేవాళ్ళు :

రాం

కాంత్

కిరణ్

శ్రీకళ

రాసింది :— 1950 సంవత్సరంలో

ఆంధ్ర పత్రిక శార్వరి నామ సంవత్సర ఉగాది ప్రత్యేక సంచికలో ప్రచురితం.

# నాలుగు స్థంభాలాట.

[స్థలం — విశాలమైన చిత్రశాల. సమయం — ఉదయం 9 గం. లు తెరలేచేటప్పటికి — చిత్రశాల గోడలనిండా బొమ్మలతో నిండివుంటుంది. రెండు, మూడు కుర్చీలు, బల్ల, ఫోటో స్టాండు, పడక కుర్చీ వగైరా. రెండు మూడు సగం గీసిన చిత్రాలు చెదురు మదురుగా స్టాండు మీద వదేసి వుంటాయి. ఒక కాన్వాసు, సగం గీసిన చిత్రం వ్రాయబడింది స్టాండుమీద వ్రేలాడుతూ వుంటుంది.

సామాన్యమైన సౌందర్యవంతుడు రాం. పడక కుర్చీలో కూర్చుని వుంటాడు. చేతిలో కలర్ పెన్సిల్. ఏదో ఆలోచిస్తూ వున్నట్లు అతడికళ్ళు అరమూతలు పడివుంటవి.

తెరలోంచి "అరె రాం" అని కేక వినిపిస్తుంది.]

రాం: ఎవరైనా స్వాగతం. (కళ్ళు తెరచి తెరవైపు తిరుగుతాడు.)

కిరణ్: (ప్రవేశిస్తూ) నేనురా కిరణ్ణి. (అందమైన విగ్రహం. నీటైన ముస్తాబు. నటకుడిలా వుంటాడు.)

రా: ఆ కుర్చీ లాక్కుని కూర్చోవోయ్. ఏం కథ? ప్రొద్దున్నే బయల్దేరావు.

కి: (కూర్చుంటూ) ఏం లేదు. మార్నింగ్ వాక్ కి బయల్దేరాను. ఏం చేస్తున్నావో చూద్దామని.

రా: ఏదో మామూలు ధోరణిలో ఆలోచిస్తూ కాలం గడుపుతున్నా బ్రదర్.

కి : మరచిపోయాను. కాంపిటీషన్ కు బొమ్మ వేస్తానన్నావు. ఏం చేశావు ?

రా : తలా తోకా తేల్లేదోయ్. సరైన మూడ్స్ రావడంలేదు.

కి : నాన్సెన్స్. ప్రతి ఆర్టిస్టూ మూడ్స్ - మూడ్స్ అంటాడు. ఏమిటో గొడవ.

రా : అదంతా తీరిగ్గా ఆలోచిద్దాం. ఆ కాన్వాస్ పెయింట్ చూడు. ఇంకాపూర్తికాలేదనుకో — సరికొత్త అభ్యుదయభావాల్తో చిత్రింపబడ్డది.

కి : (లేచి కాన్వాసు పరీక్షగా చూస్తుంటాడు) ఆ. బావుంది. కానీ —

రా : (చిరునవ్వుతో) అబ్బ. నీ కానీ రానే వచ్చిందీ — ఏమిటి నీ సందేహం.

కి : నీవు వేరేవిధంగా భావించకుండా వుంటే —

రా : ఎందుకలా అనుకోవాలి ?

కి : చిత్రంలో భావ స్ఫురణ బాగానేవుంది.

రా : మరి ఏమిటి లోపం ?

కి : తొందరపడతావేం. నీ చిత్రం హృదయాన్ని బాగానే గాయపరుస్తుంది. కానీ ఆ గాయం ఎప్పటికీ మానే రకం కాదు. అసలు మానుతుందా అని నా అనుమానం.

రా : పిచ్చివాడా ! ఎందుకు అనుమానం ? చిత్రాన్ని బాగా పరికించు. తీవ్రంగా పరిశీలించు. అందులోని రంగులు — నా భావాలకు రంగులు. ఈ చిత్రంలో తొంగిచూచేభావం - నా హృదయంలోని వెలుగు కాంతి పుంజం. (ఆవేశంగా) నా కన్నీళ్లు ఏ ఆశతో — దేనికోసం విడిపించానో — ఆ ఆశ - ఆ ఆశయం ఇందులో ప్రతిఫలించింది. అది తిరోగమనమే - అందని ఆ అద్భుత ఫలంకోసం - తీరని దాహంతో, దుఃఖిత మనస్సుతో బాధపడమని శాసిస్తుంది. నన్ను హెచ్చరిస్తుంది..

కి : నిజమే నేను కాదనడంలేదు.

రా : అలాంటప్పుడు ఆ ఎర్రరంగు చూడు — అర్థం చేసుకో — ప్రపంచములోని మానవుల క్రూరత్వాన్ని జుట్టుపట్టి బయటికిలాగి నిరూపిస్తున్నది. ఇందులో రాక్షసి ఒక మానవుడు. ఇంకో మానవుడి మీద — ఒళ్ళు బిగిసి, క్రొవ్వెక్కి, మదించి, కళ్ళు పొరలు గ్రమ్మి చెలాయించే దురంహంకార చిహ్నం. చూడు. అర్థం చేసుకో — వాడు — ఆ బక్కచిక్కి, చెక్కులు లొక్కని పోయి, డొక్కలు పీక్కుని పోయి — కాళ్లకు చుట్టుకున్న పిల్లల్తో, శోష పోయితన్నానుకున్న భార్యతో, దోసిలిపట్టి, విషాదచ్ఛాయా వదనంతో వున్నాడే — వాడు అధోలోకానికి త్రొక్కివేయబడ్డ మానవుడు. దరిద్రదేవత బందీ — ఒక మానవుడి వికటాట్టహాసం — ప్రళయకాళ పర్జన్య గర్జనలా దడ పుట్టిస్తే వణుకుతున్న శిధిల మానవుడు. జీర్ణకృశాంగి.

కి : (కాన్వాసును పరీక్షగా చూస్తుంటాడు.)

రా : కిరణ్. అడుగో వాడు సిస్సలైన మానవుడు. పిడికిలి బిగించలా ? దృఢంగా వుండలా — రొమ్మెలా వుంది - పలకలా లేదూ — వాడు దూకుతున్నాడు బరిమీదికి — ఈ కుళ్లసంఘాన్ని — పొగరెక్కి విర్రవీగే దురంహంకార చిహ్నాన్ని — సవాలు చేస్తున్నాడు. "రా కుస్తీకి" — అంటున్నాడు. ఏం కిరణ్. ఈ చిత్రం కదిలించదూ ? నా ఆవేశం, నా ఆశ, దీన్లో ప్రతిఫలిస్తున్నాయంటావా? చెప్పవేం ?

కి : దీని కంత ప్రభావం లేదని కాదు. నా గొడవ అర్థం చేసుకో బ్రదర్. ఈ చిత్రాన్ని చూచిన స్త్రీ నిన్ను ప్రేమించదు.

రా : పోనీ. నేను రసికుడ్ని కాదు. పశుప్రవృత్తితో కూడిన మీ ప్రేమ నాకక్కర్లేదు. ప్రేమకోసం బలి అవటానికి పిచ్చివాణ్ణి కాదు.

కి : నీ మొఖం. ఒక మాటకు వందమాటలు అంటావేం ?

రా : కాకపోతే. ప్రతిపనీ స్త్రీ కోసమేనా మానవుడు చేసేది? ఇంకా ప్రపంచంలో వేరే విలువలు అంటూ లేవా?

కి : అదిగాదు నీకు చెప్పబోయేది. ప్రతి జీవీ కనీసం ఒక్క జాలిచూపు, ఒక ప్రేమ మాటకోసం తపిస్తుంటుంది. అది లేని నాడు జీవితం వ్యర్థం.

రా : నేను కాదనటంలేదు. అంతమాత్రాన ప్రపంచమంతా ప్రేమకోసం స్త్రీలచుట్టూ ప్రదక్షిణాలు చేస్తుండాలని ఎక్కడైనా రాసి వుందా ఏమిటి?

కి : కాస్త ఓపిగ్గా విను రాం. లలిత కళలు సుకుమారమైనవి. సౌందర్య రహితమైన కల్పన లలితకళాకారులకు ఆరాధ్యం కారాదని నానమ్మకం. ఒక వాసవసజ్జికను చిత్రించు — ఒక విరహిని — ఇంకో నవోఢని చిత్రించు. మొదటి చిత్రం మానవుణ్ణి ఉద్రేకపరుస్తుంది. రెండోది ఏడిపిస్తుంది. మూడోది ఆనందింపజేస్తుంది. మూడూ ఎలాగూ హృదయానికి హత్తుకునేవే. కాని రెండో చిత్రం ఏడిపించినా — ఆ విలాపం కమ్మనిది. శృతికలిసిన విషాద వీణామూర్ఛన, కీట్స్ పొయిట్రీ, కృష్ణశాస్త్రి వ్యథలాగుంటుంది. అది తీయనిబాధ. ఆ బాధను తీర్చుకోవచ్చు. సంతోషంగా అనుభవించవచ్చు. తీయని భవిష్యత్తుకోసం ఎదురు చూస్తూ కాలం వెళ్ళదీయవచ్చు. ఆ బాధలో ఆశ వుంది రాం— నీ బాధకు విముక్తిలేదు. కనీసం ఆశా లేదు.

రా : శుద్ధ పొరపాటు. అక్కడే పప్పులో కాలేశావు. నా బాధకూ ఆశ వుంది. ఒక రోజు — నాబాధతీరే రోజుకోసం ఎదురు చూస్తుంటాను. అదే సంపూర్ణ ప్రజాస్వామ్యం — సువిశాల విశ్వాన్ని అల్లుకునే రోజు. సామ్యవాద జగత్తు సుస్థిరంగా స్థాపింపబడే రోజు. అదే నేను కలలుకనే భవిష్యత్తు. నా భవిష్యత్తును వర్తమానంలో చిత్రించే దినం తప్పక వస్తుంది. ఆ దినం అహంరానికి దినం — తద్దినం.

కి : నీ వాదం మంచిదే కావచ్చు కానీ నాకు మాత్రం రుచించటంలేదు.

రా : ఎలా రుచిస్తుంది మిస్టర్. నువ్వు ప్రపంచాన్ని అర్థం చేసుకోవు. నీ బాధ్యతల్ని నీవు గుర్తించడంలేదు. నీ వెప్పుడూ అలౌకికానందం, అతిమాత్ర సౌందర్యం, అగమ్య సౌఖ్యం అని అఘోరిస్తావాయె. నీలో అభ్యుదయభావాలెలా ఉద్భవిస్తాయ్. అబ్బాయ్, నేనొకటి చెప్తున్నా. నీలో ఏనాడు బూజుపట్టిన భావాలు నశిస్తాయో – నీ మనస్సులో గాఢమైన, తీవ్రమైన, బలీయమైన నవ్యత్వం విప్లవాత్మకమై ఉద్భవిస్తుందో–అనాడు–బాగా జ్ఞాపకముంచుకో– అనాడు – నువ్వు నా చిత్రాల్ని మెచ్చుకుంటావ్. నా భావాల్ని, నా రీతుల్ని హర్షిస్తావ్. అంతవరకూ నీ బ్రతుకంధకారంలో వున్నట్లే. నువ్వు కూపస్థమండూకానివే.

కి : బస్. నువ్వు "రసికుడ్ని" కాదు అనుకుంటున్నావు. అందుకనే. నీ భావగతి వక్రించింది. నువ్వు ప్రేమపిచ్చిలోపడి తన్నుకునే రోజు వస్తుంది. ఆ ఘడియ రాక తప్పదు. నీవింకా ప్రకృతిని బాగా అర్థంచేసుకోలా —

రా : పొరపాటు పడ్తున్నావు. ప్రపంచం పుట్టుకనుంచీ అంతా తెలుసు నాకు.

కి : లేదు. తెలీదు. నువ్వు "తెలుసు" అనుకుంటున్నావు. కానీ నీకు తెలియవస్తుంది కొన్నాళ్ళకు–. ఈ విశాల ప్రకృతి రామణీయకత. భగవత్సృష్టి సౌందర్యాగాధాల లోతుల్లోకి దిగలా నీవు, దిగలేకపోయావు. అందుకనే —

రా : అలా అనకు. స్త్రీకి నేను గౌరవమిస్తాను. కానీ తుచ్ఛకామానికి అంతగా అవకాశమే లేదు నా దృష్టిలో.

కి : నేను మాట్లాడేది విశాల ప్రకృతినిగురించి. స్త్రీ విషయం కాదు.

రా : ఎందుక్కాదు. ప్రకృతి–స్త్రీలకు భేదం ఏముంది ? స్త్రీ తన భర్తతోకలిసి బిడ్డల్ని కంటుంది. ప్రకృతి మీ దేవుడితోకలిసి పిల్లల్ని పెడుతుంది.

కి : అంటే స్త్రీ పిల్లల్నికనే యంత్రమనేనా నీ భావం ?

రా : ఒక రకంగా - అంతే.

కి : అంటే ?

రా : అంటే స్త్రీలల్లో రెండు జాతులున్నాయి. పద్మిని, శంఖిణీకాదు. ఒకటి మీ జాతి. అది సంతత కామ సౌఖ్యం, ప్రాపంచికానందం కోసం తహ తహ లాడేరకం. కానీ రెండోది నా జాతి. అభ్యుదయాన్ని వాంఛించేది. ప్రేమను ప్రేమిస్తుంది. ఆప్యాయతతో ఆదరిస్తుంది. వాంఛను జయిస్తుంది. వియోగాన్ని భరిస్తుంది. అంత మాత్రాన 'హిస్టీరియా' వ్యాధికి బలికాదు. ఆశయాల్ని ప్రేమిస్తుంది. కానీ తుచ్ఛంగా కామించదు.

కి : నీది మెట్ట వేదాంతం.

రా : కాదు ఎప్పటికీ కాదు.

కి : తప్పకుండా అవుతుంది. కామ తృష్ణ కారణం గాని నీ ప్రేమ వృథా. నీ కల కల్ల. నిన్ను ప్రేమించిన స్త్రీ నీవు నపుంసకుడి వని విలపిస్తుంది.

రా : అంత మాత్రమే నీకు తెలిసింది. ప్రతిఫలాన్ని కోరని ప్రేమే నిజమైన ప్రేమ. ట్రూ లవ్. అదే నా గమ్యం. దానికే నా ఫస్ట్ ప్రైజ్. చివరికి — ప్రేమకు కాముకత్వాన్ని జోడించి దాంపత్యమని పేరు పెట్టారుగా మీ నీతిపరులు.....ఉత్త స్వార్థపరులు.

కి : (పెద్దగా నవ్వుతాడు) ప్రతిఫలాన్నాశించని ప్రేమ పుట్టలా ఇంత వరకూ ___

రా : దురభిప్రాయం. అంతా తెలిసినట్లే మాట్లాడుతున్నావు. ఇదిగో వీడు — వీకు — పుట్టాడు. చూస్తావుగా నా దృఢత్వం.

కి : ఎలాగూ చూడనూ - సరేగాని. ఒకస్త్రీ ఏకాంతంగా నిన్ను కలుసు

కుంటుందనుకో - నీలో ఏం భావాలు జనించవా ? ఏ కోర్కెలు రేకెత్తవా ?

రా : అంతవరకూ రానిచ్చేదెవరు ? నే నే స్త్రీని ఏకాంతంగా కలుసుకోను. అందుకు ఇష్టపడను కూడా —.

"అది పిరికితనం" అంటూ కాంత్ ప్రవేశిస్తాడు.

(పూల పూల బుష్ షర్టు. చేతిలో పూవు. మంచి షోకిల్లాలా వుంటాడు. మధ్య మధ్య పూవు నాఘ్రాణిస్తూ పచార్లు చేస్తుంటాడు.)

కాంత్ : రాం. నేనన్నది వినపడిందా ? పిరికితనాన్ని అసహ్యించుకుంటాడు — ఈ కాంత్.

రా : అది పిరికితన మెందుకవుతుంది ?

కి : ఎలా అవుతుందో నేచెప్పనా ?

కా : నువ్వేం చెప్పగలవోయ్. పాలబుగ్గల పాపవి. నే చెపుతా విను రాం. ఈ కాంత్ ఎంత అనుభవశాలో నీకు తెలుసుగా ?

రా : ఆ. ఏకాంతంగా కాంతా కాలక్షేపం తమ దినచర్యలో ప్రథమ ఘట్టం అనే మహాసత్యం ఎలా మరచి పోగలను.

కా : ఇంకేం. అందుకే నిన్ను "పిరికివాడివి" అంటున్నాను. ఒంటరిగా స్త్రీని కలుసుకోడానికెంత భయం ?

రా : భయం కాదు. పిరికితనం అంతకంటేకాదు. ఎందుకు ఒకర్ని వంటరిగా కలుసుకోవాలి. ఏమిటి అవసరం ?

కి : అవసరమో, అనవసరమో ప్రశ్న అడుగుదాం కాని, సపోజ్, నీకు తటస్థపడిందే అనుకో - అప్పుడు -

రా : అప్పుడు. ఆమె అనుభవాన్ని, అనుభూతుల్ని వివరించమంటాను. అర్థమయ్యేదాకా ప్రశ్నల్తో ప్రాణంతోడి తెల్సుకుంటాను. ఆమె అనుభవాలకీ, ఆశలకీ, ఆశయాలకీ — నా జీవితానికీ, ఆచరణకీ

మధ్య అంతరం, ఎడం ఎంతవుందో తెలుసుకుంటాను. ఆమెతో హృదయం విప్పి మాట్లాడుతాను.

కా : వండర్‌ఫుల్. పుటిక్కిన కళ్ళూ కళ్ళూ కలుపుతావు. హస్తాలు జోడిస్తావు. "ఓ నా ప్రణయదేవతా" అని అష్టోత్తరనామాలు జపిస్తావు. ఆమె కులుకులో, తళుకులో, బెళుకులో, హొయల్లో, చూపుల్లో, ముస్కిలేస్తావు. ముగ్ధుడవై మురిసిపోతావు. ఆమె వలిపమై, కంచుకమై, జడలో పువ్వువై, కంటిలో పాపవై, కనుకొలుకులో నలకవై, చెరగులో అంచువై, కుచ్చెళ్ళలో మడతవై, ముంగురుల్లో పెంపుడుకై, నిట్టూర్పులో వేడివై, "ఇన్" లో బాధవై, "త్వమేవాహం, తాదాత్మ్యం," అని పులకరిస్తావు.

రా : టకటకా ! నీ ఎక్స్పీరియన్సు అంతా కుమ్మరించాంపే మానెత్తిన. అంతా మీలాంటి యంబ్రహ్మలే అనుకున్నావా ఏమిటి ఖర్మ ?

కి : అనుకోవడమేం. చూస్తూంగా రాం. నీ గొప్పదనం.

కా : రాం. బుద్ధుడు. వివేకానందస్వామి ఇంకా — ఇంకా ——

రా : ఇంకా. అను నీ యిష్టంవచ్చినన్ని.

కి : ఏమైనా "వనిత తనంత తా వలచి వచ్చిన" అంత ఈజీ కాదు — నన్ను ముట్టమాకు అనడానికి.

రా : అబద్ధం. మీ వృధా ప్రచారం.

కా : కిరణ్, "తెలిసీతెలియని వరుడెల్ల బ్రహ్మదేవునివశమే." అన్నారు పెద్దలు.

కి : అదీ చాలదు, "అనుభవంలోంచి వివేకం వస్తుంది. మరి అనుభవమో ? అవివేకంలోంచి" అన్నారు సైమన్ బోలివర్ బక్నర్.

రా : అందరూ అన్నీ అంటూనే వుంటారు. అసలు మీకు ప్రపంచ జ్ఞానం తక్కువ. "ప్రపంచ జ్ఞానం అంటే ఏమీలేదు. మానవుల

లోఘపాట్ల సమూహం" అన్నారు డికెన్సు.

కా : ఆఖరికి మాకే ఎసరు పెట్టావూ. నీవు ఎక్స్‌పరిమెంట్ చేసిచూడు. నీకే తెలుస్తుంది.

కి : వీడికి తెలీటం కష్టం. మానవులు, పురోగమనం — ఆకలిమంటలు, ఆకలి చావులు — ఇవి తప్ప ప్రపంచంలో కులాసాగా, హాయిగా ఎంజాయ్ చేయటానికి ఏమీలేవంటాడు ఈ అభ్యుదయవాది. వీడికి ఆపాడురొచ్చులో ఏం ఆనందముందో ?

రా : ఆ ఎంజాయ్‌మెంట్ కూడా రొచ్చే. ముద్దులో ఏముందోయ్‌తీపి. పెదవులు కలుస్తాయి. ఒకరి పెదవి సిగరెట్ కంపు అయితే, ఇంకొకరి పెదవి "లిప్‌స్టిక్" వాసన. పైగా లాలాజలస్రావం. అంతకంటే "లావా" రుచిచూడొచ్చు.

కా : హోప్‌లెస్‌లీ డర్టీ ఫెలో. "ది లాస్ట్ పఫ్ ఆఫ్ ఎ సిగరెట్ ఈజ్ ఈక్వల్ టు ది ఫస్ట్ కిస్ ఆఫ్ ఎ లాస్" అన్నారుపెద్దలు. ఎంత మాధుర్యం చవి చూడందే అంతమాట అన్నారూ అని నా బాధ. నా సొద ఒకడూ ఆలకించడేం.

రా : చెప్తలతుప్పు వదిలేట్టు వింటున్నా కాంత్.

కా: సుప్వేమన్నా అనుకో రాం. ఇంతకీ నే చెప్పదలుచుకున్నది ఏమిటి అంటే స్త్రీలని ఉద్ధరించాలి అని. ఆ ఆశయం, నా చిరసంచిత ధనసంచయం లాంటిది. నన్ను వేధిస్తున్న, తపన పెడుతున్న, మహత్తరమైన, మధురాతిమధురమైన వాంఛ.

రా : ఉద్ధరించు. ఎవరొద్దన్నారు ?

కా : కాబట్టి, నా వాంఛకు బూజు దులిపి పాలిష్ పెట్టాలంటే — వాళ్లను బుర్రగల వాళ్లగా, సబలలుగా, స్వతంత్రాభిప్రాయంకలవాళ్లగా తయారుచేయాలి. ఆర్థిక స్వాతంత్ర్యం వాళ్లకు వచ్చేందుకు తగిన స్తోమత కల్పించాలి. కమ్మరిలాగ సాగ గొట్టి వాళ్ల బుర్రల్ని మరామతుచేయాలి.

రా : అంటే పాతలాంతర్ని అలమరనించి ఉద్ధరించి, ఎలక్ట్రిసిటీ లేని రోజున బాగుచేసుకున్నట్లా ?

కా : ఎగతాళిచేయవాకోయ్. యుగ యుగాలుగా స్త్రీ దుర్దశ అనుభవిస్తోంది.

రా : నీ కనువిప్పు ఇప్పుడు కలిగిందా ?

కి : నీ యిష్టం వచ్చినట్లు ఉద్ధరించవోయ్. ఎవరొద్దన్నారు..

కా : అదికాదు. రాం ఎగతాళిగా మాట్లాడుతుంటేను. కవి ఏమన్నాడో తెలుసా —

"నా కవిత్వం —
వేయి గులాబీల సెజ్జ
మజ్లిన్ లు పరిచిన
వేయి బూరగ దూది పరుపుల దొంతర్లు
నిజం. నిజం.

నా కవిత్వం —
నూత్న వధూ నేత్రాల్లో
ఉజ్వలంగా వెలిగే
లేత ఎర్రని జీర
జీరలో దాగిన
ఇంద్ర ధనువు.

నా కవిత్వం —
ప్రేయసీ ప్రియుల దృఢోపగూహనమ్ముల మెలగు
ఉన్నత వక్షోజ ఘర్షణమ్ము,

అంతియే కాదు —
ఘర్షణమ్మున జారిన ఘర్మకణము.

నా కవిత్వం —
అతివ మిన్నల ప్రథమ సంగమ
దివ్య మధురానుభవ నిమేషం."

రా : శాంతించుమహాత్మా. ఇంతకంటే కవి చౌడప్ప శతకం బట్టీపెట్టు.

కి : ఆనందించలేనివాడి ముందు సౌందర్య ప్రదర్శన శుష్క దండుగ. భాగవతంలో చెప్పనే చెప్పారు. "అంధేందూదయముల్, మహా బధిర శంఖారావముల్" కవిగారు ఇంకా చాలా చెప్పార్లే.

రా : చిత్తం తమసూక్తులు వినలేక చస్తున్నాను.

కా : ఉత్త పిరికి వాడివోయ్. నిన్నుచూస్తే జాలేస్తుంది. నా ధోరణికే తట్టుకోలేని వాడివి — అతదాని ప్రైటకొంగు తాకిడికేం తట్టుకో గలవు? ప్రియురాలి ముద్దులేన్నెంతమాయించుకోగలవు. ప్రేయసి కౌగిలింతలో నీ కూపిరెట్లా ఆడుతుంది?

రా : ఫరవాలేదు నాయనా. నాధోరణిలో నన్ను బ్రతకనీయండి.

కా : నీ కోరిక ఫలించుగాక. అరే చాలా లైటెం అయిందే. నాకు పని వుంది. వస్తా. ఫీర్ యా బోత్. (నిష్క్రమిస్తాడు).

రా : అమ్మయ్యా! సుడిగాలిలావస్తాడు. ఏదో దుమారం రేపి పోతాడు.

కి : కానీ లైఫ్‌ని పరిపూర్ణంగా ఎంజాయ్ చేయాలనే తత్వం కాంతది.

రా : ఇంతకన్నా చీకు చింతా లేనివాడు ప్రపంచంలో వుండడేమో కిరణ్. జీవితాన్ని ఒక ఆటవస్తువులా చూస్తాడు. దొరికినంత మటుకు అనుభవిస్తాడు.

కి : అదో రకం పోలసీ. "కార్పే డయిమ్".

రా : సరే గాని కిరణ్, నీవు ఏదో బాధ పడుతున్నట్లున్నావ్.

కి : ఏం లేదే.

రా : ముఖాన్ని అద్దంలో చూసుకో. నా దగ్గర కూడా దాచగలవా ఏమిటి?

కి : ఏమీలేదు రాం. కాంత్ చెప్పినదానిమీద ఆలోచిస్తున్నాను. నేనూ ప్రేమించాను. ఎవరిని-అని అడక్కు.

రా : అడగన్లే. భయపడకు. ఇవాళ్టి నీ మాటల ధోరణిని బట్టి

ముందుగానే వూహించాను. ఆమెను సంపూర్తిగా అనుభవించా లనీ — అమె నీకోసమే సృష్టింపబడిందని — అనుకునే దాకా వచ్చిందా — నీ ప్రేమ ఘట్టం.

కి : లేదు. ఇంకా అధిపత్యాన్ని పొందాలనేటంత స్వార్థపరుణ్ణి కాలేదు. కానీ - ఆమె యవ్వన మధువును - ఆ అనాఘ్రాత వికసిత పుష్ప సౌరభాన్ని ఆస్వాదించాలని, ఉద్రేకంతో-ఆశతో-విలపిస్తున్నాను. వియోగాన్ని ఎలాగో భరిస్తున్నాను.

రా : ఏమైనా—నువ్వెవర్ని ప్రేమించినా—ఆమె ఎలాంటిదైనా—నా అభి ప్రాయం చెప్పమంటే — ఆమె మీదకల్గిన, కల్గుతున్న, నీ తుచ్ఛ వాంఛను సాధ్యమైనంత తక్కువ మోతాదులోకి తగ్గించుకో — ఒక వేళ నీ ప్రేమ ఫలించకపోవచ్చు — దిగులుపడకు — అప్పటి పరిణామం నీ వ్యక్తిత్వం మీద ఎక్కువ దెబ్బతీయలేదు. ఏమీ జరగని వాటిలా మామూలుగా మనగల్గుతావు. నిజంగా నీయత్నం లాభిస్తుందే అనుకో. అనాడు - ఆ మధురక్షణంలో - నీవూహించే, ఊహిస్తున్న, ఎన్నడూ ఊహించలేని సౌఖ్యాన్ని చవిచూస్తావ్.

కి : ఏమో ! ఏమవుతుందో. నేను అసమర్థుణ్ణి ఈవిషయంలో. మొండివాంఛను, ఫలితమెలావుంటుందో నిర్ణయించలేని వాంఛను, జయించలేకపోతున్నాను. క్షణికమైన భౌతిక సుఖం కోసం నా శక్తిని, మేధస్సును, నిర్జీవంగా, బానిసగా పతనం చేసుకుంటు న్నాను.

రా : తెలిసి బాధపడతావేం కిరణ్ ? మహాబలంతో మానవుడు జయించని దంటూ ప్రపంచంలో లేదు. కాంత్ అన్నాడే — "పిరికి" అని. ఆ పిరికితనం నీలో చొరనీయకు. ఇన్నికబుర్లు చెప్పి ఇంతలో డీలా పడతావేం ?

కి : మళ్ళీ కలుస్తా రాం. నీ కాలం చాలా వృధా చేశాను.

రా : ఫరవాలేదు. మళ్ళీ కలుస్తావు కదూ ?

(కిరణ్ నిష్క్రమిస్తాడు)

రా: వీడ్ని చూస్తే జాలేస్తుంది. శశికోసం వీడు బాధపడతాడు. ఆవిడ నా కోసం బాధపడుతుంది. ఇవ్వాళ శశితో మాట్లాడాలి. ఆవిడ వస్తే బావుణ్ణు.

(కాసేపు నిశ్శబ్దం. కళ్ళుమూసుకుని పడుకుంటాడు.)
"మిస్టర్ రాం." (తెరలోంచి పిలుపు వినిపిస్తుంది)

రా: (విసుగ్గా లేచి కూర్చుని) ఎవరు?

(తెరలోంచి) నేను శశిని.

రా: శశివా? చంద్రుడివా?

(తెరలోంచి) కాదు వెన్నెల్ని.

రా: నా జీవితాన్ని వెలిగించటానికి వచ్చావా?

(తెరలోంచి) అవును. నిన్ను వెన్నెల్లో, తేలిపోయే మబ్బుల్లో, తెల్లని ఇసుక తిన్నెల్లో, నీలి సంద్రతరంగాలమీద, ప్రేమడోలి కల్లో, ఊగించడానికి వచ్చా.

రా: అంతే అయి వుంటుంది. కాంత్ పంపివుంటాడు నిన్ను.

(తెరలోంచి కలకలనవ్వు వినిపిస్తుంది). అవును. కాంత్ పంపాడు — నీ కౌగిట్లోకి. నీకు రసమార్గం ఎరిగించాలని — రమ్మంటావా? నీ జీవిత నాటకంలోకి — నీ వెలుగులబాటల్లోకి — నీ ఆశల కూటంలోకి — నీ భావన్ల అలల్లోకి — రమ్మంటావా?

రా: రా. సుస్వాగతం. ఇది సామాన్య అహ్వానం కాదు. ఒకడి చరిత్ర నిజాయితీ ప్రస్ఫుటమవడం కోసం — రా. నా కళ్ళ వెలుగుల్లోకి. నా ఆశాజ్యోతి నలరించడానికోసం — రా — నా మనోగహ్వరం విశాలంచేసి అలంకరించా — నా హృదయ కవాటాలు పూర్తిగా తెరిచా — రా. ఆహ్వానిస్తున్నా, నీరాజనంపడుతున్నా- నా జీవిత శయ్య అధిరోహించడానికి — నాతో జీవితాన్ని పంచుకోడానికి — స్వాగతం. సుస్వాగతం. శశీ.... వెన్నెలా....

(తెరలోంచి) వస్తున్నా. వచ్చేశా — నేను శశిని. పెన్నెల్ని.

(శశి ప్రవేశిస్తుంది. నిరాడంబర మైన వేషంలో అందంగా అగు పడుతున్న నాగరిక. ఆమెకళ్ళల్లో పల్లెటూరి సహజసిద్ధ మైన అమాయకత్వం తొంగిచూస్తుంటుంది.)

శశి : ఏం రాం. కవిత్వం మాట్లాడుతున్నావు.

రా : నువ్వు మాట్లాడిందేమిటి ?

శ : నువ్వు ఏదో భాషలో ప్రశ్నిస్తే సమాధానం ?

(ఇద్దరూ గలగలా నవ్వుకుంటారు)

శ : (కుర్చీలాక్కొని దగ్గరగా కూర్చుంటూ) ఇవ్వాళేదో కొత్తగ మాట్లాడుతున్నావు ?

రా : ఏం లేదు. కొంత్ చెపుతుంటాడే ఆ రసానుభవం చవి చూద్దా మని —

శ : నిజంగానా ?

రా : ఏం. నీ దగ్గరకూడా అబద్ధమాడ్తా ననుకున్నావా ?

శ : (చిలిపిగా నవ్వుతూ) అప్పుడే ప్రేమ ఘట్టం ప్రథమ సోపానాని అధిరోహించావు.

రా : నిజంగానే. (చేతితో ఆమె చుబుకాన్ని స్పృశించి) నేనెక్క డున్నానో, ఏం చేస్తున్నానో, ఏంచేస్తానో తెలీని స్థితిలో వుంది నా అవస్థ.

శ : (నవ్వుతూ) రెండో మెట్టెక్కావ్.

రా : ఏమో నాకేంతెలీడంలేదు — అర్థంకావడంలేదు. ఏదో ఆనందం ఏదో బలీయ మైన వాంఛ నన్ను లొంగదీసుకుంటున్నది. ఇదిగో శశీ. ఇలా చూడు—నాకళ్ళల్లోకి చూడు. ఏమిటో నా నరాలు పట్టు తప్పుతున్నాయ్. నా చైతన్యం లుప్తమవుతోంది.

శ : ఎందుకు రాం. అలా ఆవేశపడతావు ?

రా : ఆవేశం. ఆవేశం కాదు. ఏదో మహత్తర శక్తి — నీలో — నీ లోంచి వుద్భవిస్తోంది. నన్ను సమ్మోహితుణ్ని చేస్తోంది. నా హృదయవీణ అనంతానంద మూర్ఛనల పలుకుతోంది. ఏదో, ఏదో అనివార్యమైన ఆవేశం — నన్నావహిస్తోంది. నీవు — నీవు నా స్వంతం. నా కోసం. నిజం — నవ్వకు. నాకోసం సృష్టింప బడ్డావు. నాదానివి — నా ఆత్మవి — నా ప్రాణానివి. ఏమిటి ఆ పెదాలమీద. ఎందుకా హాసం — నన్ను వశంచేసుకుంది చాలకనా? నీ నేత్రాల్లో ఎందుకంత మాదకత్వం — ఎందుకంత ప్రభావం నిక్షిప్తమయింది ? ఆ పెదాల్లో అమృతం — కాస్త నాకు భాగ మీయవూ ? (శశికళకు మరీ దగ్గరగా జరుగుతాడు)

శ : (లాలనగా) ఎందుకంత తన్మయత్వం ప్రేమలో-ఊబిలో-పంకంలో దిగబడతావెందుకు ? నే చేయిస్తా నిన్ను ఒడ్డుకి —

రా : అవును. నీవే దరి చేర్చాలి. దీనుణ్ణి.

శ : నేను నీ దాస్నే రాం. లక్ష జన్మాలెత్తినా నీ దాన్ని. ఎందుకింకా భయం ?

రా : ఇలా నిన్ను చూస్తూ, నీ అందాన్ని త్రాగుతూ, నిన్ను స్మరిస్తూ శిలనై పోగూడదూ.

శ : అబ్బ ఎంత ప్రేమ ! ఇంకా పరిపక్వం కావాలి.

రా : ఇంకానా. అవుతుంది. నీ ప్రేమకోసం నా ప్రాణం బలి చేసే రోజు కూడా వస్తుంది అవుసరమైతే.

శ : తప్పు. ఎందుకా మాటలు. మన ప్రేమాకాశానికి చంద్రుడివి నువ్వు. చంద్రికను నేను. కిరణ్, కాంత్ తారకలు. ఇంకా ఏం కావాలి చెప్పు. జీవితంలో హాయిగా, ఆనందంగా నాలుగు స్థంభాలాట ఆడుకుంటున్నాం. మనం ఏదో క్షణాన ఎవరో ఒకరం అవుట్ అవుతాం. దొంగ మిగిలి పోతాడు. ఇంతకంటే రసవత్తరం, ఆనందదాయం ఏముంటుంది ? ఇంతకన్నా అధికం మనం కోరే దేముంది ?

రా : నువ్వేమైనా అనుకో శశీ. నీ పాదాల చెంత ప్రాణమైన విడ వాలని వుంది నాకు. చివరికి-మధురభావాలు పుట్టించే నీ పాదాలు గూడా శిల్ప శాస్త్ర ప్రకారం చెక్కినట్లున్నాయి. ఎంత సౌంద ర్యం విన్యసించింది నీలో !

శ : ఎందుకలా పొగుడుతావు ? ప్రేమికుల కళ్ళు మసకలు కమ్మితయ్. ప్రేమాంధకారంలో దారీతెన్నూ మరచిన నిన్ను, మళ్లీ యధా ప్రకారంగా మార్చాలి. ఎంత కష్టమో మరి. నన్ను బాధ పెడ తావా ? నా కోసం — నా ముద్దు చెల్లించవా రాం ? నా కోసం — నీ మహాశక్తి, నీ సృజనాశక్తి నాశనం చేసుకుంటావా ? ప్రపంచం ఓ గొప్ప శిల్పిని — చిత్రకారుణ్ణి కోల్పోవలసిందేనా ? నీ ఆశలు, ఆశయాలు అన్నీ బూజుపట్టి శిధిల మవాల్సిందేనా ?

రా : ఏమో నాకు తెలీదు. నా ఆశలు, ఆశయాలు అన్నీ నీవే. నా సర్వస్వం నీవే. ఏ ఊహా ప్రేయసి కోసం 'వేదుల' వేదనా భరితుడై రోదించాడో, ఏ ఊహా ప్రేయసి కోసం 'బాపిరాజు' శిల్పం, కవిత్వం అంతా ఖర్చయిందో, ఏ ఊహా ప్రేయసి కోసం 'కరుణ శ్రీ', ప్రణయశ్రీ [జంధ్యాల ప్రణయ సుందరి] నే నిర్మించు కొన్నాడో — అలాంటి భావనారూపం — ప్రత్యక్షంగా నా కళ్ళ ముందు నాట్యమాడుతోంది. ఎన్నాళ్లనుంచో ఇలాంటి అపురూపం కోసం నా మనస్సు తపిస్తోంది. ఆ రూపం నువ్వే — నువ్వే శశీ — ఆ. నీ కోసం ఎన్ని కన్నీళ్ళు గార్చానో తెలుసా ? ఎంత బాధ పడ్డానో తెలుసా — ఆ "వియోగాశ్రులకు, విషాదాశ్రులకు ఖరీదు గట్టే షరా"బెవడైనా వున్నాడా ?

శ : ఎందుకంత బాధ. నీ బాధకు నేనెలా ఉపశమనంగా అక్కరకువస్తే అలాగే వుపయోగించుకో. నిన్నెవరూ అడ్డడంలేదుగా. అరచేతిలో వైకుంఠం చూసుకొని మురుస్తావేం ? నా సర్వస్వం అనుభ వించు. ఈ రసానుభూతిలో నీ కానందంలేదా ?

రా : అసమర్థుణ్ణి. పనికి రానివాణ్ణి.

శ : అసమర్థుడు. శశికళాప్రియుడు అసమర్థుడు కావటానికి వీల్లేదు. జీవితసత్యాన్ని పరిపూర్ణంగా నీదాన్ని చేసుకో —. ఏముందయ్యా. దాంపత్యంలో — సంయోగంలో. ఏనాటికైనా మనిద్దరం ఒకటే. ఒకటే రూపం. రెండు ప్రతికృతులు.

రా : నిజం. శశీ. నిజం. శశికళాప్రియుడు అసమర్థుడు కావటానికి వీల్లేదు. వీల్లేదు. [కాసేపు నిశ్శబ్దంగా కళ్ళుమూసుకునివుంటాడు. శశికళ ఉత్సుకతతో అతడ్ని పరిశీలిస్తూ వుంటుంది. అమాంతంగా లేచి కాన్వాసుదగ్గరకు పోతాడు. కుంచె, రంగులు తీసుకుని ఏదో దిద్దుతుంటాడు. కొద్ది సేపు గడుస్తుంది. శశికళ లేచి రాం చేస్తున్న పనిని ఏకాగ్రంగా పరిశీలిస్తూ వుంటుంది. పని పూర్తి చేసి శశికళ చేయి గట్టిగా పట్టుకుంటాడు.]

శ : ఏమిటి రాం ?

రా : థాంక్స్. శశీ నా పని పూర్తి అయింది. నా కోర్కె ఫలించింది.

శ : [సంతోషంగా] అయిందా ? పూర్తి అయిందా ? ఏదీ సామ్యవాదం నిరూపిస్తున్నావా ? ధన్యురాల్ని నీ సాంగత్యం వల్ల. ఎంత గొప్పగా వుంది బొమ్మ. అబ్బా. నీ మొదటి చిత్రం చూచిననాడు నా గుండెల్లో గల్గిన గాయం నేటికి మళ్ళీరేగింది. ఏవో అవ్యక్త భావన్లు ఈగల్లా ఎన్నో పుండును ముసురుతున్నాయి. ఇహ చూడ లేను. [చిత్రాన్ని చెరగుతో కప్పుతుంది.] ఇలా చూడు రాం. ఇప్పుడు నా అందం నీలో కోర్కెలు రేపటంలేదా ? [రాం ముఖా నికి ముఖం దగ్గరగా చేర్చి చూస్తుంది.]

రా : లేదు.

శ : ఎందుకని ?

రా : ఏమో.

శ : అంత వికారంగా వున్నానా నేను.

రా : ఛా.

శ : మరి ఎందుకంత ఆవేశపడ్డావు ?

రా : అది తాత్కాలిక ఉద్రేకం. చిత్రం పూర్తికాలేదనే బాధపడుతున్నా నువ్వు రాక పూర్వం. ఎంత ప్రయత్నించినా మూడ్స్ రావడం లేదు. కాంత్ చెప్పిన మాటలవల్ల, నీ సహాయంతో కృత్రిమ వాతావరణం నిర్మించుకొన్నా. కానీ సహజమైన నీమీది ప్రేమ ఉధృతంగా బయటపడ్డది. నువ్వూ దోహదం చేయటం — అంతా ఒక విచిత్ర ఘటన — ఎలాంటి చిత్రం గీయించావు నాచేత. ఎందుకైనా సమర్థురాలివి. నీ ఋణం ఎలా తీర్చుకునేది ?

శ : ఋణం ! పిచ్చిరాం. నీ ప్రేమకంటే నాకేంకావాలి. నీలాటి అద్భుత వ్యక్తి సాన్నిధ్యాన్ని నాకు ఎప్పుడు ప్రసాదించావో అప్పుడే నీకు ఋణ విముక్తి అయింది. కానీ మన అనుబంధం అనంతకాలం ఇలానే వుంటిపోవాలని దేవుడికి మ్రొక్కులిడుతున్నాను.

రాం : నా కోసం బాధపడతావెందుకు శశీ. నీ గొప్పతనంవల్లనే నేనూ ఒక మనిషిగా నిలవబడ గల్గుతోంది.

శ : నా మొహం గొప్పతనం. హాయిగా యేవేదో ఎవ్వర్కీ తెలీని రహస్యాల్ని మాట్లాడుకుంటూ, ఒకర్నొకరు పొరుసుకుంటూ, సముద్రపొడ్డున తిరుగుతూవుంటే — సరదాగా వుంటుంది.

రా : నిజమే మరి. సాయంత్రం పోదాం.

శ : సాయంత్రమేంలాభం. ఇవ్వాళ పూర్ణిమ కదూ రాత్రి వెళదాం. కమ్మటి వెన్నెల్ని అనుభవిస్తూ పసిపిల్లల్లా ఇసకలో ఆడుకుంటుంటే ఎంత బావుంటుంది ! చందమామను కాజేసి జాకెట్లో దాచుకోవాలనిపిస్తుంది.

రా : అమ్మో. అంత పనే. విరహంలో ప్రాణాలు కొరికి పారేస్తాడు.

శ : [నవ్వి] మనకు విరహ మెక్కడిది. మనిద్దరం ఒకచోటే. నాకా వెధవ భయాలేం లేవు బాబూ.

రా : పాపం ! [ఇద్దరూ నవ్వుకుంటారు]

[హడావుడిగా కాంత్ ప్రవేశిస్తాడు.]

కా : [కోపంగా] శశి కళా దేవీ!

శ : ఏం ఎందుకంత కోపంగా అరుస్తావు కాంత్.

కా : కోపంగాక ప్రేమపుట్టుందనుకున్నావా? [ఎగతాళిగా] నీ దయ వల్ల బంగారంలాంటి మిత్రుడు మరణించాడు. అందంలో ఎంత విషముంది.

రా, శ : [ఆదుర్దాగా] ఏమిటీ?

కా : [నిరాశగా కూలబడుతూ] శశికళా తిరస్కృత ప్రేమికుడు కిరణ్ విషం పుచ్చుకొని ఆత్మహత్య చేసుకున్నాడు.

రా, శ : ఆ!

కా : అంతా తమ దయ.

రా : అబద్ధం. శుద్ధాబద్ధం. కిరణ్‌కి అంత ధైర్యం లేదు. అంత పని చేయలేడు. నేను నమ్మను.

కా : నువ్వు నమ్మినా నమ్మకపోయినా జరగవలసింది జరిగిపోయింది.

శ : [నిశ్చలంగా] ఇది నిజమే అయితే — ఒక మిత్రుడు రాలిపోయాడు. ఒక కాముకుడు నశించాడు. ఈ విశాల విశ్వంలో ప్రేమకోసం చచ్చేవాళ్ళులేరు. కామం కళ్లకెగదట్టి — ఒక అసమర్థుడు — ప్రేమను అర్థం చేసుకోలేక — అసువులు బాశాడు. పూర్ ఫెలో.

రా : అనవసరంగా కామెంట్ చెయ్యకు శశీ —

శ : కామెంట్ కాదు. ఈ అసమర్థుల గుంపును చూడ్లేక— హృదయ పూర్వకంగా సానుభూతి చెప్పలేక — విలపించే దుఃఖిత మానవి వేదనా ప్రకటన — ఇది. అంత కంటే నథింగ్.

రా : అబ్బ. కాంత్ అసలిలా ఎందుకు జరిగింది?

కా : ఎందుకా — మొదట్లోనే చెప్పాగా యీమెగారి దయ అని.

శ : అనవసరంగా నన్నంటావేం కాంత్. నే చెపుతా విను రాం. అతను నన్ను ప్రేమించా నన్నాడు. మంచిది — అన్నాను. వివాహం చేసుకో మన్నాడు. తాళ్లతో బంధిస్తే కట్టుబడి వుండే ధైర్యం నాకు లేదన్నాను. నిన్ను కాపాడాల్సిన బాధ్యత నామీద వుంద న్నాను. అంతే. ఇంకేమీ జరగలేదు. [తల వంచుకుంటుంది].

రా : ప్రొద్దున నాతో మాట్లాడి వెళ్ళాడే. అప్పుడైనా ఏమీ అనలేదు వాడు. అతన్నిగురించి శశితో మాట్లాడుదాం అనుకుంటున్నాను. ఇంతలో ఇలా జరిగిందేమిటి?

కా : కిరణ్ అంతిమసందేశం వినే ధైర్యం వుందా మీకు? వినగలరా?

రా : తొందరగా చెప్పు. నా మనస్సు బాగాలేదు.

కా : నీ కోసం, నీ క్షేమం కోసం, నీ భవిష్యత్తు కోసం కిరణ్ మర ణించాడు రాం. నువ్వు లేందే శశి లేదు. శశికళ లేనిదే నీ భవి ష్యత్తు శూన్యం. నీ కళా హృదయం మోడువారుతుంది. నీ సృజనాత్మక శక్తి నశిస్తుంది. నీ జీవితం, నీ గొప్పదనం వృథా అవుతుంది. తాను బ్రతికివుంటే ఏ క్షణానైనా శశి తన ఆకర్షణకు లొంగక తప్పదనే సత్యం గ్రహించాడు కిరణ్. నీ కోసం — నీ కోసం ప్రాణాలు వదిలాడు.

రా : ఆఖరికి నా కళ.... ఒకరి ప్రాణాలు గూడా — ఒకరి ప్రాణాల్ని బలి తీసుకుందా. ఇంత స్వార్థపరుణ్ణా నేను. కాంత్ — వెధవ కళ వెధవగొప్ప. కిరణ్ లేని నాడు ఎందుకిదంతా — (కాన్వాసు చిత్రం చించబోతాడు.)

శ, కా : ఆ! ఆ! (తటాలున చిత్రం లాక్కుంటారు. శశి బొమ్మను తన ఒళ్లో పెట్టుకుంటుంది)

కా : ఏం పిచ్చెక్కిందా రాం. ఎంతో తపఃఫలితాన్ని వమ్ముచేస్తావా?

రా : (గద్గదికంగా) తపః ఫలితం. ఏ మిత్రుని ఆనందం కోసం ఇంత

తపస్సుచేశానో — ఆ మిత్రుడే లేనప్పుడు — ఏం లాభం ?
ఎందుకీ తపస్సు. ఒట్టి స్వార్థ పరుడిగా మిగిలిపోయాను.

శ : క్షమించు రాం. కిరణ్ ఇలా అవుతాడని తెలీదు. నా ఆశల్ని వివరించి చెప్పానతడికి. నిజానికి నా తప్పేమీ లేదు. ఇలా చేస్తాడనుకోలేదు.

కా : పోనీ రాం. కిరణ్ ఆత్మశాంతికి ప్రతిఘాతం కల్గకూడదు. నీ బొమ్మ కాంపిటీషన్‌కి పంపించు. ప్రైజ్ రాగానే కిరణ్ స్మారక చిహ్నం ఏర్పరుద్దాం.

రా : స్మారక చిహ్నం. స్మారక చిహ్నం. (అంటూ రాం నిష్క్రమిస్తాడు.)

శ : కాంత్. ఏమిటి అసలు గొడవ.

కా : (పెద్దగ నవ్వుతాడు.)

శ : (ఖంగారుగా) పిచ్చి పట్టిందా ఏం ?

కా : నీకు తెలీదు శశీ. రాం తత్వం నీకింకా బాగా తెలీదు. అతడి చేత కాంపిటీషన్‌కు బొమ్మ గీయించాలి. కిరణ్ - నేను ఒక ప్లాను వేశాం. ఏదో ఒక షాక్ తినిపించాలి. లేకపోతే అతడు మనలాంటి మనిషే. షాక్ తిన్నాడా అద్భుతమైన వ్యక్తి. వండర్స్ సాధిస్తాడు.

శ : అమ్మయ్య. బ్రతికించావు. హడిలిపోయాను. రాం బాధ చూసి.

కా : నిన్నెందుకు ఇక్కడకు పంపిచావనుకున్నావు. ఆ కాన్వాస్ చిత్రం సగంగీచి వదిలేశాడు. ఆ పని పూర్తి చేయించాలి. అందుకోసం. అప్పటిదాకా అతడ్ని ప్రేమలోకంలో ముంచిఎత్తేను. కిరణ్ కూడా సమయానికి తంథాన అన్నాడు. నీ సహాయం కావాల్సి వచ్చింది. నిన్ను ఉపయోగించుకున్నాం.

శ : అందుకనే రాం అంత తీవ్రంగా, ప్రేమ కైపుకూతలు కూశాడు.

ఎప్పుడూలేనిది నా పిచ్చి రాం ఇలా అయిపోయేదే అని భయ పడ్డాను. నేను దగ్గరికి పోయేకొద్దీ – ఆత్మార్పణం చేసే కొద్దీ మనిషి మారిపోయాడు. ఎంత ఊరించినా, యెంత వొరుసుకున్నా ఎంత నిగ్రహం ప్రకటించాడు! నేను దూరంగా వుంటే దగ్గరక వస్తాడు. దగ్గరకు వస్తే దూరంగా పోతాడు. వింత ప్రకృతి

కి : అదే విచిత్రం (అంటూ ప్రవేశిస్తాడు)

కా : రాంని అర్థంచేసుకోవడం చాలా కష్టం కిరణ్.

శ : కిరణ్ ఎంతగాభరాచేసేవు. పోనీలే రాం మంచి బొమ్మ గీస్తాడు గొప్ప పేరు వస్తుంది.

కి : అంతేనా. కాంపిటీషన్ లో ఫస్ట్ ప్రైజ్ రావాలి.

శ : అంతాకోరేది అదేగా –

కా : అమాయకప్పిల్లా! రాం కోసం ఏం బాధ పడ్డావు —

శ : నీకు తెలీదు కాంత్. ఇలాంటి మిక్చర్ ఆఫ్ ఆపోజిట్స్ అంటే నాకు చిన్నప్పట్నించీ చాలా ఇష్టం. మొదట్లో రాం ప్రేమపిచ్చి చూసి బాధపడేదాన్ని ఇప్పుడు గర్వపడుతున్నా. నావల్లేగా ఇంత ఆర్టిస్ట్ అయింది.

కి, కా : ఆహా!

కి : మా ప్లానంతా వేస్ట్ అంటావు.

కా : అసలుకే ఎసరు పెట్టావే?

శ : మీరేమైనా అనండి. రాం నావాడు. నావాడు.

కా : నీ వాడ్నేం చేయటంలేదు. మే మెక్కడికీ ఎత్తుకెళ్ళం.

కి : ఇన్నొసెంట్ గర్ల్.

(ఇంతలో రాం తూలుతూ ప్రవేశిస్తాడు.)

రా : (కిరణ్ణి చూచి) కిరణ్ (దిగ్గరగా అరుస్తూ కావిలించుకుంటాడు. అతడిచేతిలోంచి బొమ్మవేసిన కాన్వాస్ షీట్ క్రింద పడుతుంది.)

కా : [గభాల్న కాన్వాస్ తీసుకుని] వండర్ఫుల్. ఎంత బావుంది రాం. శశీ ఇలా చూడు. బ్యూటిఫుల్ ఆర్ట్. [శశికిస్తాడు]

శ : అబ్బ ఎంత బావుంది. రాం. నా పిచ్చిరాం. [రాం జుట్టు నిమురుతుంది.]

రా : 'ఏమిటిదంతా. కిరణ్. నా కిరణ్. బ్రతికే వున్నావా ?

కా : అదంతా తరవాత చెప్తాం. ఈ చిత్రానికి పేరు సజెస్ట్ చెయ్యి.

రా : ఏంచెప్పను. నాకంతా అయోమయంగా వుంది. కిరణ్ నాప్రక్కనే వున్నాడు. శశీ, నీవు అంతావున్నాం. పోనీ వెధవ బొమ్మ. పోనీ.

కి : నా కోసం వేసిన బొమ్మకు నేనే నామకరణం చేస్తా. "మిత్ర వియోగం" ఏమంటావు శశీ.

శ : నా ప్రాముఖ్యం పోయింది. ఇంక నేనేమంటాను.

కా : ఎక్కడికి పోలేదు. రాం నీవాడు.

కా : మచ్ ఎడో ఎబవుట్ నథింగ్.

కి : ఆల్ ఈజ్ వెల్ దట్ ఎండ్స్ వెల్.

శ : నాలుగు స్థంభాలాట.

కా : ట్రాజీ కామెడీ.

రా : ఏదన్నా కానీ — అంతా హుషారుగా జరిగిపోయింది. మొత్తానికి శశి అన్నట్లు — మనది "నాలుగు స్థంభాలాట". నాలుగు స్థంభాలాట. ఆట అయిపోయింది. అంతా సుఖంగా వున్నాం.

(తెర వ్రాలుతుంది)

## Balarama Timber Depot

*Managing Partner :*

ANNAM VENKATA SUBBA RAO

*Teak wood, Non Teak wood, Logs,*
*Sizes, Furniture etc.*

**Jagannadhapuram, Machilipatnam 521 001**

## Sri Dhanalakshmi Rice Mill

*Managing Partner :*
Sannala Venugopala Rao *B.A., B.L.,*

**Machilipatnam**
**Krishna District**

# స్టూడెంట్ యూని

(సాంఘికం)

కళా మాని, సహృదయులు

## శ్రీ తుమ్మల జగదీశ్వరరావు కు



గౌరవ పురస్సరంగా కానుక

బూదరాజు శ్యామసుందర్

వచ్చేవాళ్ళు :

కామేశం

మహేశం

రాం

కిష్టు

కుమార్

భీమారావు

రచన : 1951 లో

ఆంధ్ర సారస్వత సమితి
పంచమ వార్షికోత్సవ సందర్భంగా
రచనకు
ప్రత్యేక బహుమతి పొందిన నాటిక.

# స్టూడెంట్ రూమ్

(లైట్లన్నీ బాగా వెలుగుతూ వుంటాయి. స్టేజి నిశ్శబ్దంగా వుంటుంది మహేశం కుడివైపుగా ప్రవేశిస్తాడు. ఏదో ఆలోచనతో మునిగి పోతున్నట్లు అగుపిస్తాడు.)

మహేశం: రుచీ పచీ లేని జీవితం. నిద్ర ముంచుకొస్తుంది. హస్కు కొడదాం అనుకున్నప్పుడు ఒక్క స్నేహితుడు కూడా కనిపించడు. ఒంటరిగా జపం చేసుకుందాం అనుకుంటే మనస్సు ఊరుకుంటేకదా. ఈ ఊళ్ళో అసలు కల్చర్ ఉన్నట్లుగా లేదు. నాటకాలే లేవు. డాన్సుల్లేవు. డర్టీ లైఫ్. కామేశం కామేశం వస్తున్నట్లుంది. కాసేపు వాగిద్దాం.

కామేశం: (ఎడమ వైపుగా ప్రవేశం) ఏరోయ్! మహేశం. స్వగతాల్లో వుండే వ్యవహారం. పాతాళ్ళెమరేస్తున్నావేరా?

మ: (కాసేపు ఆగి హఠాత్తుగా) హల్లో మై డియర్ కామేశం. నీ పేరులోనే వుందిరోస్ ఆవేశం.

కా: ఏరా బాబూ. ఇది స్టేజి — రోడ్డు కాదు. కవిత్వం కట్టిపెట్టి కలకాలం అక్కరకువచ్చే కబుర్లు చెప్పరా బ్రదర్.

మ: కబుర్లు — ఈ ఊళ్ళో కల్చర్ లేదు. గాలించినా దొరకదు. కల్చర్ — కబుర్లు ప్రకృతి వికృతులు.

కా: అఘోరించావ్ గాని అడ్వాన్స్డ్ తెలుగు. కల్చర్ అంటే ఏమిటిరా? అదంతగా ఎందుకు దొరకటం లేదు? విశదీకరింపుము.

మ: కల్చర్ ఓ కొత్తరకం మిక్చర్. ఈ మధ్యనే ప్రతి వాళ్ళ నాలికలకు చురుకెక్కించిన క్రొంగ్రొత్త పదం.

కా: ఆహాఁ!

మ: పూర్వం మన దేశంలో కల్చర్ ముడి పదార్థ రూపంలో విరివిగా దొరికేదట - పెద్దలు అంటుంటారు. కానీ ఈ రోజుల్లో ఎగుమతుల్ని సర్కారు వారు నిషేధించారుగా - అందుకని కల్చర్ ఉత్పత్తి తగ్గించి ఒక్క సో కాల్డ్ నాగరికుల కోతల్లోనూ, ప్రజానాయకుల నాలికలమీద మాత్రమే ఉత్పత్తి అవాలని — అదీ పరిమితమైన ప్రమాణంలో వుండాలని గవర్నమెంట్ రేషన్ అమలు జరుపుతోంది.

కా: అయితే బ్రదర్. నాకో చిన్న సందేహం. మరి బ్లాక్‌లో కల్చర్ ఉత్పత్తికి పర్మిట్లు సంపాదించ రాదుట్రా. అసలే నిరుద్యోగంలోవున్న మనకి చేతి నిండా పనైనా దొరుకుతోంది.

మ: బ్లాక్ వ్యవహారం కూడా కష్టంగానే వుంది భాయ్. అంతా మినిస్టీరియల్ లెవెల్ లో ప్రయత్నం చేయాలి.

కా: ఆరి నీ దుంపతెగ. మొన్నటి దాకా సుంకర కొండయ్యకు ఓట్లకోసం తిరిగావుకదరా.

మ: అదంతా ఓట్ల సీజన్ రా. తరవాత మన మాట వినే వెధవెవడంటావు?

కా: పోనీలేరా. వెధవ కల్చర్. మన గొడవ మనకుందిగా. నాటకాలు — డాన్సులు.

మ: అవీ లాభం లేదురా కామూ. మనం ఏడవటమే హానీ — ఈ ఊళ్ళో నాటకాల్లేవు. డాన్సుల్లేవు. డర్టీ టవున్.

కా: "నిరాశ నిద్రా హేతువు. దురాశ దుఃఖం చేటు". అన్నార్రా బ్రహ్మంగారు ఎట్సెట్రా.

మ: (డ్రమెటిక్‌గా) ఆశ - నిరాశ - టు బి ఆర్ నాట్ టు బి నాటకమేద్దాంరా. మనమైనా కల్చర్ పుట్టిద్దాం. వేడి పుట్టాల్రా. జనంలో ఉద్వేగం పెరగాలి. విప్లవం — విప్లవం పుట్టాల్రా. పీపుల్ దూకాలి — తోశాల్రా ముందుకి —

కా: దేనికిరా?

మ: నాటకాలేయడానికి — దేశాన్ని ఉద్ధరించడానికి —

కా: ఏం అయిడియారా? వండర్‌ఫుల్.

మ: సామాన్యమైన బుర్రట్రా మనది. జీరో ఫైవ్. ఫైవ్ జీరో.

కా: ఆఖరికి బ్రాకెట్‌లోకి దిగింది మన కల్చర్.

మ: అవున్రా భాయ్ వినంగా వినంగా బ్రాకెట్ భాషే మనకి ఇన్స్పిరేషన్. మనం ఆడబోయే నాటకంలో 6 పాత్రలు. ఒక్కదానికి జీరో ఇంపార్టెన్స్.

కా: బ్రహ్మాండమైన బుర్రరా భాయ్ నీది. 5 పాత్రలూ అయిదు రకాలంటావు.

మ: అయిదుగురు అఖండులు. శిఖండులు. ఉత్త బండలు.

కా: నీ బొంద. మనల్ని మనమే కించపరుచుకోడమా? ఫూలిష్.

మ: అది కాదు బ్రదర్. వాస్తవికత మన దృక్పథం మనము ఆదర్శ పాత్రలం. మనం మిగతా విద్యా సోదరులకు నిజం చూపిస్తాం. వాళ్ళ చేత తలలూ స్తాం. చివరకు ఇది అసలు పద్ధతి కాదు. (డ్రమెటిక్‌గా సోదరులారా! మన తత్వం మారాలి. మన విద్యా విధానం మారాలి. మనల్ని నిరుద్యోగులుగా, అసమర్థులుగా, బానిసలుగా తయారుచేసే యీ విద్యా విధానం మారాలి. భావి విద్యార్థి సోదరులకి నూత్న మార్గం ఇది —

కా: బహూత్ ఖుషీ. విద్యార్థుల్లో విప్లవం రేగాలి ఆ దుమారానికి ప్రపంచం తెలవోగ్గాలి. విద్యార్థు నైతిక, సాంఘిక పరిస్థితులు మారాలి. మనల్ని రాజకీయంలో దించి, ఉపయోగించుకొని అవ రాలు గడుపుకుంటున్న రాజకీయ నాయకుల దుర

త్రాలునశించాలి. నాకి కళ్ళు తెరిపిడిపడాలి. అందుకనే (ఉపన్యాస ధోరణిలో) సోదరులారా! నా ప్రియమైన విద్యార్థి సోదరులారా! మేము నాటిక ప్రదర్శించబోతున్నాం. అంతేకాదు మీ కళ్ళు తెరిపించబోతున్నాం. మనల్ని మనం గుర్తు తెలుసుకోవాలి. నిజం తెలుసుకుని, ఆలోచించుకొని ముందడుగు వేయాలి. అప్పుడే — ఆ రోజునే మనకు భవిష్యత్ వుంది. వుండితీరుతుంది. (మహేశం వైపు తిరిగి) ఎలా — వుంది — మన యాక్షన్?

మ: బ్రహ్మాండంగా వుంది. ఎవరూ చప్పట్లు గొట్టరేం. అయ్యగారి పేరుచెప్పి డోలు కొట్టరేం. మేం నాయకులం కాదనేనా?

కా: నిజమే. మనం నాయకులం కాదు. జండాలు పట్టుకుని తిరగం. ఊకదంపుడు ఉపన్యాసాలు దంచం. నిజాన్ని నిజంగా, అబద్ధాన్ని అబద్ధంగా చిత్రిస్తాం. ప్రజల ముందు పెడతాం. తీర్పు మీది. ఫలితం మీది. ప్రయోజనం అందరిదీ — ఏమంటారు?

మ: సరే అంటున్నారులేరా. "పదరా ముందుకు పడిపోదాం."

కా: ఎక్కడికి పోవడం? ఏట్లోకి. మనకి మేకప్ మాన్ లేడు. పోస్టర్లు రావు.

మ: ఓస్. అంతేనా. నాకు జనాన్ని చూస్తే భయం. నోట్లోంచి మాటరాదు. వచ్చిన కొద్ది పోర్షన్ కూడా ప్రాంప్టింగ్ లేందే పరార్.

కా: పరీక్షల్లో ఎప్పుడూ కాపీ చేయలేదురా దద్దమ్మా

మ: అది అఖండమైన ఆర్ట్ రా భాయ్. అంద
అబ్బదు.

కా: మరి - నీ గతి.

మ: ఏదీ గతి. మార్కులు వేయించుకోవడమే.

కా: ఇంతకీ జడ్జీలు మనవాళ్ళేనా ఏంటి? రహస్యం
చెప్పు.

మ: కాదనుకో.

కా: మరి ప్రైజ్ రాదే.

మ: రామాయణమంతా విని - ప్రైజ్ కోసమేనట్రా
నాటకమాడేది. వెర్రినాన్ - మనం కళాతపస్వు
మనది కళాహృదయం. కళ ప్రజలపరం. మనం చే
పని -

కా: (ప్చ్) - ఉత్త గో-బిట్వీన్ పని.

మ: అంతకంటే మరెంత? నాంది అయిపోయింది. అస
రంగంలోకి దిగుదాం. అంతా తయ్యారైనారా?

కా: ఇంకా ఇంతసేపా. మనది ఇండియన్ పంక్చ్యువాలి

మ: ష్యూర్. ష్యూర్. ఆ. డాన్సుల్ గట్రా ఏమన్నా

కా: నీ బొంద. నువ్వేమన్నా ట్రయినింగు ఇస్తే గదా?

మ: అదెంతసేపురా, మన వాళ్ళు ఫుల్ రిహార్సలు అవే
లోగా మనం డాన్సు ప్రాక్టీసు చేద్దాం. లైట్
ఆరడం. మళ్ళీ వెలగడం. నాటకం మొదలు.

కా: అంతా టెక్నికల్ గా వుందే.

మ: కాక. లెఖ్ఖా. గజి బిజా. మనం తలుచుకుంటే అసాధ్యం ఏముందీ?

కా: ఇంపాజిబుల్. సరే కాని మన్ది గొట్టాల డ్రామాయేనా?

మ: అని నీ సందేహం. "సందేహం సర్వ నాశనం". గొట్టాలేమిటి?

కా: పద్యాల డ్రామాంరా భాయ్. రాజు దగ్గర నుంచి ప్యూన్ దాకా దీర్ఘాలు తీస్తారే అవి గొట్టాలు. సైరన్ కూతలు.

మ: చంపేశావ్ గుండెలు మురగవృట్టా అల్లా పాడితే— అయినా అసలు నా గాత్రం—

కా: గార్ధభమేళ. అంటావ్! ఫరవాలేదు—యీ రోజుల్లో ఆడవాళ్ళుకూడా స్టేజి ఎక్కంగానే గొంతు మార్చి డైలాగ్ చెపుతున్నారు. అల్లాగా నీవూ గొంతు మార్చి 'బేస్ వాయిస్'లో పాడరా.

మ: అదంతా ఆలోచిద్దాం. మన నాటకానికి స్టోరీ, సస్పెన్సు వగైరా—

కా: అవన్నీ వుంటే మన గొప్పేముంది రాభాయ్. నాటకమో, నాటికో, క్విజో, జనం తెలుసుకుండే లోగానే మన ప్రదర్శన అయిపోతుంది.

మ: భేష్. కుశాగ్రబుద్ధివిరా!

కా: మహేశం. కేక కొట్టుకున్నావేరా?

మ: ప్రేమ ప్రవరస్. ఉత్తరపోసం చేసుకున్నా. ఏం ఇప్పుడేం పంగా లేనంటావ్?

కా: ఎసిమియా సిమెంట్ వాలకంలా వుంది అయ్యవారి వాలకం.

మ: ఇంతసుందరి జనాన్ని చూసే సరికే చమట పట్టింది. స్వంత మేకప్ గనక మళ్ళీ పొడవలేస్తా.

కా: కాని బాబూ. జరా కాసే. అయినా నాటకానికి పొద్దు పోయేట్టుంది. అరేసుకోవాల్రారా.

మ: అరసంగానే ముందు వాసనవేసింది. టీ నీళ్ళకేనా ఇంత పడుపు. ఛల్ కే జేటా చల్.

(లైట్లారి పోతాయ్)

(స్టేజి అంతా చీకటి. ఒక్క సినిమా తార ఫోటో మాత్రం స్పాట్ లైట్ ఫోకసులో అగుపిస్తుంటుంది. "మాత్ అర్గన్" సన్నని కూనిరాగం).

ఒకగొంతు: "పలికింపవేలనే నా హృదయపీణా
ఒలికింపవేలనే దివ్యమూర్ఛనల ॥
పలికింతువేని నా భగ్నవీణియను
ఒలుకునేమో మధుర శోక గీతికలు ॥

ఇంకోగొంతు: పలికిస్తోందోయ్. ప్రేమ బికారీ పలికిస్తుంది. చీకట్లో చిందులాటేంటిరా డర్టీ ఫెలోస్—

(లైట్లు వెలుగుతాయి. 'రాం' ఒయ్యారంగా సినిమా తార ఫొటో చూస్తూ పరుపునానుకొని పడుకొని వుంటాడు. ప్రక్కనే కుమార్ మౌత్ ఆర్గన్ వాయిస్తూ వుంటాడు. ఇంకో ప్రక్క కిష్టు కూర్చొని సిగరెట్ దమ్ము పడుతుంటాడు. గదిగోడలనిండా సినిమాతారల ఫొటోలు. గది అసహ్యంగా చిందరవందరగా నిజమైన స్టూడెంట్ రూమును జ్ఞాపకం చేస్తూవుంటుంది.)

మొదటిగొంతు:— మోసులెత్తినవోయి ఎదలోని రొదలు
సొదలలో మధురాలు సోనలై కురిసినయ్
పూవులై విరిసినయ్ తేనెలై వారిసినయ్ ॥పలి॥

రెండవ గొంతు:— ఒరేయ్ రాం! నీ ఎదలో రొదతో నా మది బండబారిపోతుందిరా బాబూ. ఎందుకొచ్చిన సొదరా నాయనా యిది. (విసుగ్గా అంటాడు.)

రాం: నీ పీక నులుముతారోయ్ కిష్టిగా. "ప్రేమ మిఠాయీ, తింటుంటే హాయీ." డోన్ట్ డిస్టర్బ్. ఘుట్టం మంచి క్లయిమాక్సులో వుంది. (పాట మళ్ళీ ఎత్తుకుంటాడు)

కిష్టు: ఒరే అబ్బాయ్ నే నీ న్యూసెన్సు సహించను. నా రూమ్ ఖాళీచేసెయ్యండి.

మూడోవాడు:— (మ్యూజిక్ ఆపి) యువర్ ఆనర్. ఈ రూమ్ నా సొంతం. నోరుమూసుకో లేకుంటే ఒక్క రెన్టు కంట్రోల్ పిటీషన్ తో నీ కొంప గుండం.

కి: ఒరేయ్ కుమార్ గా [ఎగతాళిగా] యుష్మద్దూషణంబునం గడునల్గినవాడనైతి. ఇదియో మదీయ దేవదత్త భూంకారము. [మౌత్ ఆర్గన్ బిగ్గరగా వూదును.]

ఇదియ్యది మదీయ చక్రాయుధము. భయపడుమురా దుర్మార్గా. (సిగరెట్ విసిరివేయును.)

కుమార్ :— [సిగరెట్ దులుపుకుంటూ] ఇడియట్. వెధవ తెలుగూ నీవ్వూను. కృష్ణుడిది దేవదత్తంట్రా. ఏడ్చినట్లుంది నీ తెలివి.

కి : నువ్వో ఏడ్చావ్ రేలంగి అన్నట్లు.

రా: నీకీరోగం ఇంకా పోలా. అన్నట్లేమిటి పెసరట్లు. యువర్ హెడ్.

కు : భమిడిపాటి అన్నట్లు —

కి : నారోగంకేంగాని అసలు నీ రోగం విడమరచు నాయనా. అన్నిటికీమధ్య వీడొకడు వెధవ కుమారుడు. చస్తున్నా నీవిరహావేదన చూాడ్లేక. చదువా సంధ్యా. చెత్త పాటల్తో రూమ్‌ని సినిమాహాలు చేస్తున్నావు.

రా: నీ తలకాయ. కామారపు జీడిలా తగులుకున్నావేరా — మాక్కోప మమ్మల్నిపడనీక.

కు : అదేందంటే. అన్నట్లు ఒక 'కొటేషన్,' మన ముఖాన పారేస్తాడు ఫూల్.

కి : హోల్డ్ యువర్ టంగ్ ఫర్ ఎ వైల్ — మిస్టర్.

(తెరలోంచి టెలిగ్రాం సార్ అని కేక.)

టి. పి:— [ప్రవేశిస్తూ]. రాం గారెవరండి.

రా: ఏమిటి. టి...యం. ఒ. నా?

టి : సారీ. టెలిగ్రాం సార్.

రా: చచ్చాం. (సంతకంచేసి తీసుకుంటాడు.)

కు : పర్సు ఖాళీ అయినప్పుడల్లా పోస్ట్ మాన్ కేక టి. యం. ఒ. లాగానో లంకె బిందెలు దొరికినట్లు గానో అనిపిస్తుందండీ స్టూడెంట్సుకు.

(అందరూ నవ్వుతుండగా టి. పి. నిష్క్రమణ.)

రా: సోదరులారా. దేవరవారి నెత్తిన పిడుగుపాటు.

కి : ఏం. డెత్ న్యూసా?

రా: షటప్. మానాన్న వస్తున్నాడురా.

కు : డామిట్. మీ ఫాదరే.

కి : ఏం చేద్దాం?

కు : అబ్బాయిలూ నాదారిన నేను చెక్కేస్తా. సినిమా హాలు శరణ్యం.

కి : ఎందుకురా అంత గాభరా. ఆయనేం దయ్యమా భూతమా.

రా: నీకు తెలీదురా బాబూ. వాటి తాత. జగతల ప్రతాప్.

కి : ఆపద్బాంధవా. ఇంతకీ ఏ ట్రైన్కి.

రా: ఎయిట్ క్లాక్ కేరా బాబూ.

కు : మీరెట్లయినా చావండి. నాదారిన నే పోతున్నా.

రా: మేమూ వస్తాము రా –

కి : నీ పిప్పేమైనా దురదగా వుందా?

కు : గుడ్ బై. (నిష్క్రమణ)

రా: అరే కిష్టూ ఈ స్మశానం సెట్టు క్లాస్ రూమ్‌గా మార్చాలిరా. నువ్వూ ఒక చెయ్యి వెయ్యాల్సిందే. లేకుంటే తేమల్దు.

కి : (యాక్టివ్‌గా) యస్. బి క్విక్.

(చాపలు దులిపి నీటుగా పరుపులు పెట్టాడు. సిగరెట్ పీక్కలు ఎత్తి పారబోస్తారు.)

రా: అరే కిష్టూ ఆ బొమ్మలన్నీ తిరగబడెయ్యరా కాస్త.

కి : (విసుగ్గా) ఆ సినిమా బొమ్మలన్నీ అట్లా తగలెయ్యకపోతే ఈ బాధ లేదుగా. (అన్నీ తిరగ వేస్తాడు గాని ఒక బొమ్మ మరచిపోతాడు)

(సినిమా తారల బొమ్మలన్నీ టాగూర్, గాంధీ, నెహ్రూ వగైరాలుగా మారిపోతవి.)

రా: (చేతులు దులుపుకుంటూ) ఇక మనం శ్రద్ధ నటించాలిరా. చదువుకుంటూ కూర్చుందాం.

(ఇద్దరూ పుస్తకాలు తెరచి పెట్టుకొని కూర్చుంటారు.)

రా: స్వీట్ సైలెన్స్. స్వీట్ లవ్.

కి : నువ్వు డ్రామా తప్ప ఇంకేం చదవ్వా ఏరా?

రా: నాకు నచ్చిందదొక్కటేరా. జీవితమే డ్రామా — మనం ఇప్పుడాడుతుంది డ్రామా. ఇంకా చాలాసేపు ఆడాల్సింది అదే.

కి : చాలించరా బాబూ ఊకదంపుడు.

(తెరలో చెప్పుల చప్పుడు. ఇద్దరూ ఎటెంటివ్ గా వుంటారు. "ఒరేయ్ రామూ" అంటూ భీమారావుపంతులు ప్రవేశం. పూర్వ కాలపు వేషము. ముక్కుద్దాల జోడు. చేతిలో వంకీ కఱ్ఱ. ఇద్దరూ లేచి నిలబడతారు.)

రా: రాండి నాన్నా. మీ టెలిగ్రాం ఇంతకు ముందే అందింది.

భీమారావు: వేరే పనుంది వ్రాళ్ళో (కూర్చుంటూ) ఆ... ఇతడెవరోయ్. (రూమ్ కలయ జూస్తుంటాడు).

రా: ఇతను నా 'రూమ్ మేటండీ.

భీ: ఆహా. నాతో గూడ ఎంగిలి కూతలేనా. నోరార "సహాధ్యాయీ" అంటే ఎంత బావుంటుంది. కాలమే మారింది. నిన్ననేం లాభం, (కిష్టు వైపుతిరిగి) అబ్బాయ్ బాగా చదువుతున్నారా.

కి: మరేనండి. స్టడీయింగ్ హార్డ్లీ సర్. అంటే చచ్చేట్లు చదువుతున్నా మన్న మాట.

భీ: అన్నమాటో గిన్నమాటో. ఈ భీమారావు ఎదుట ఆ 'చ' కార ప్రయోగం మాత్రం కానీవాకండి.

రా: లేదుగాని నాన్నారూ. ప్రాణం పోతే మటుకు పరీక్షు పోవటానికి వీలుందా ?

భీ: (కోపంగా) మళ్ళా అదే కూతా. అఘోరించారుకాని జాగ్రత్తగా చదవండి. ఎల్లుండే గదరా పరీక్షలని వ్రాశావ్.

రా: అవునండీ.

భీ : ఆ. ఇంకేమిట్రా సంగతులు. మీ ఆరోగ్యం వగైరా ఎలా వున్నయ్.

కి : ఆరోగ్యం కేంగానీండి. వగైరాలు బాగానే వున్నయ్యండి. (ఇంతలో అలారం మ్రోగుతుంది.)

భీ : ఇదేంట్రా. ఇప్పుడలారం మ్రోగుతుంది?

కి : (గాభరాగా) సినిమాకు వెళ్దామని ...

రా : (తెల్లబోతాడు)

భీ : ఎల్లుండి పరీక్షలేంటి? మీ సినిమా గోడవేంటి?

రా : (తెప్పరిల్లి) లేదు నాన్నా.

భీ : (కోపంగా) ఏం లేదు. నీ బొంద.

రా : (కోపంగా కిష్టు వైపు చూస్తాడు). లేదు నాన్నా. మా కాలేజీలో ఎడ్యుకేషనల్ ఫిలింస్ చూపిస్తారు. మా పాఠాల్నే సినిమాలుగా చూపిస్తారు. హాజరు కాకపోతే ఫైన్ కూడా వేస్తారు. అదోక డబ్బుదండుగ. అందుకని — అన్ని సినిమాలకు హాజరవుతుంటాం.

భీ : వాళ్ళ పిండాకూడు. పరీక్షలముందు సినిమాలేంటి. అసలు మీ ప్రిన్సిపాల్ని అడుగుదాం పద.

రా : (బిత్తరపోయి) మా ప్రిన్సిపాల్ గారు ఇంట్లో వుండరే ఇప్పుడు. క్లబ్‌లో వుంటారనుకుంటా. ఏరా కిష్టూ.

కి : నిజమండీ పంతులుగారూ. ఆయన క్లబ్ లో వున్నప్పుడు ఎవ్వరితో మాట్లాడరు కూడా —

భీ : ఛా, ఛా. ఏం చదువులు ఏం కథ. (ఇటూ ఇటూ పచారు

చేస్తూ) ఒరేయ్ ఈ అద్దం ఎక్కడిదిరా?

రా: ఈ మధ్యనే కొన్నానండీ.

భీ : ఎంత?

రా: అయిదున్నర.

భీ : ఓరి నిన్ను గలగొయ్యా. పావలా పరకపెట్టే బంగారం లాంటి అద్దం వస్తుందే. నెల తిరక్కముందే పైకం ముడ్తుందనేగా కళ్ళు పైరలు కమ్మినయ్. నాప్రాణం తియ్యడానికి దాపురించావురా బాబూ.

రా: నే చెప్పేది కాస్త వినిపించుకోండి నాన్నారూ.

భీ : అఘోరించావులే. చేసిందిచాలు. ఇంకా వ్యాఖ్యా నంకూడా ఎందుకు?

రా: అదికాదండీ. ఊరికే దుబారా చేయడానికి నేనేం కష్టం, సుఖం తెలియని వాణ్ణా? ఈ మధ్య బావ గారు వచ్చారు. ఆయనడిగితే మొహమాటం వల్లా, కాదంటే మీరేమంటారో అనే భయంవల్లా కొనక తప్పలేదు. ఈసారివచ్చినప్పుడు ఆయన తీసుకెడతా నన్నారు.

భీ : (విసుగ్గా) నాయన్నాయనా. ఇలాంటి అల్లుడు శత్రువు కైనా వద్దు. అల్లుఢి సంబరాలతో కొంప గుల్లయే టట్లుంది. అచ్చంగా దశమ గ్రహమే.

కా: అందుకు తిరుగుడేముందండీ.

భీ : నోర్ముయ్. (అద్దం చూస్తూ దవాలున వెనక్కి తిరిగి) అదెవర్రా?

(రాం, కిష్టు బిత్తరపోయి ఒకరి వైపు ఒకరు చురుగ్గా చూసు
కుంటారు.)

రా: ఆమె . . .

భీ : (వినిపించుకోకుండా) నీక్కూడా సినిమా కైపెక్కిందన్న
మాట. ఇహ బాగు పడ్డట్టే. ఇంకా ఎందుకురా
ఈ ఫ్రూళ్ళో. సర్దూ. సర్దరా మూటా ముల్లే.

రా: అది సినిమాతార బొమ్మ ఎందుకైందీ ?! ఆమె
"ఏంజలా" అని అమెరికా ప్రెసిడెంటు మేనకోడలు
నాన్నా. గొప్ప విదుషీమణి. అందుకని ఆ మొఘాటో
ఇక్కడుంచాంగాని చెత్తా కానీ సినిమా బొమ్మల్ని
అందులో గాంధీ మహాత్ముని ఫొటో ప్రక్క తగిలి
స్తామా. ఇన్సల్ట్.

భీ : గాడిద కూంతలు కూయకు. కవయిత్రే అయితే ఇలా
విరగబడ్తు ఫోటో తీయించుకుంటుందట్రా. నేనేం
పిచ్చోణ్ణనుకున్నా?

రా: నే చెప్తే నమ్మవ్. మీకేమో తెలియదు. ఏట్లా
చచ్చేది.

భీ : మళ్ళీ "చ" కార ప్రయోగం.

రా: (కిష్టుతో) డోంట్ ఫియర్. (భీమా. తో) ఆమె మీద
ఠాగూరంత గొప్పవాడు వ్రాసిన పద్యాలు వినిపిం
చనా నాన్నా. అప్పుడైనా నమ్ముతారు. (పుస్తకా
ల్లోంచి ఫైల్ బైటికి లాగుతాడు)

భీ : [తృప్తిపడినట్లు కన్పిస్తూ] మళ్ళీ అవన్నీ ఎందుకు

లేవోయ్ ఇప్పుడు. నేనేదో సినిమా రకంది కామాల్సు అనుకున్నా. నా తెలివి మండా. ఆ. మన గొడవ ఎప్పుడూ వుండేదేకాని – రేపు మధ్యాహ్నం గదిలో వుండు. అర్ధరాత్రి మీ చదువు చెడగొట్టడం దేనికి.

రా: ఇప్పుడెక్కడికి వెళ్తావ్ నాన్నా. మీ దోవన మీరు హాయిగా పడుకోండి. మా చదువు మేం చదువుకుంటాం.

భీ : కాదులేరా. శంకరం గారింటికి వెళ్లాలి. రేపు మధ్యాహ్నం వస్తా మళ్ళీ.

రా: సరే మీ యిష్టం.

(భీమారావు చేతికఱ్ఱ మరచి నిష్క్రమిస్తాడు)

రా: అమ్మయ్య. "గాడ్ సేవ్ ది కింగ్" అన్నట్లు – ఇప్పటికి ప్రాణాలు కుదుటపడ్డయ్. [సిగరెట్ వెలిగించి గాఢంగా దమ్ములాగుతాడు.]

[ఇంతలో భీమారావు ప్రవేశిస్తాడు]

భీ : నా చేతి కఱ్ఱ.

రా: [తండ్రి చూడకుండా సిగరెట్ కిష్టు వెనకాల పారేసి]

ఇదుగో నాన్నా. అరే నేనూ చూళ్ళేదే [చేతికి అందిస్తాడు.]

భీ : ఏంట్రా వాసన. చుట్ట కంపు కొడ్తుంది.

రా: లే... లేదు నాన్నా. ఈ కుఱ్ఱాడు ఎప్పుడన్నా తగలేస్తూ వుంటాడు.

భీ : నువ్వా నాయనా ?

కి : అవునండీ. పెద్దవాళ్ళ యెదట ఎందుకని అవతల పేల్చేశాం గాని లేకపోతే ఝాంఝామృతంగా కాల్చేస్తామండీ.

భీ : బహువచనం పలుకుతున్నావే. మావాడు కూడానా.

కి : లేదండీ. బహువచనంబు గౌరవార్థంబని చిన్నయ సూరి సూత్రమండీ. చూ. బా. వ్యా. గిరీశంలాంటి మహా పండితుడు గూడా దీని ప్రయోగంలో వెనకటి రోజుల్లో బ్రహ్మాండమైన లెక్చర్ దంచేశాడండీ. వారి అడుగు జాడల్లోనే భూప్రపంచం అంతా నడ వాలి అని దండోరా వేయించారండీ. అందుకని... (సిగరెట్ దమ్ము గాఢంగా లాగి విడుస్తూ) వస్తానండీ. గుడ్ నైట్. (నిష్క్రమిస్తాడు)

భీ : అరే వెధవాయ్. వీడెవడ్రా గడుగ్గాయ్. గిరీశం అంటున్నాడే. [కోపంగా] వీడెక్కడ దొరికాడ్రా నీకు. పెద్దా చిన్నా లేదు వెధవకి. నా ఎదట — నా ఎదట సిగరెట్ కాలుస్తాడ్రా ఫుండాకోర్. ఈ ముసలి మదరష్టపాడు ఏం చెప్పినా మీ కసహ్యంగానే వుంటయ్. సిగరెట్లు, బీడీలు తాగి చెడిపోయేవ్. లబ్బున నీజీవానికి పడి ఏడవాల్సొస్తుంది. వీలుంటే ఇంకోడ్ని చేర్చుకో. వీడిముఖం చూడవాకు. వస్తా. నా ముఖం మీదేనా. వీడి సిగరెట్ తగలెయ్య.
[గొణుగుతూ నిష్క్రమిస్తాడు]

రా: [సిగరెట్ అప్యాయంగా కాలుస్తూ] వెధవ చదువు. [పుస్తకం గిరాటువేస్తాడు] ఫస్టు మార్కు వచ్చినా లాస్టు మార్కు వచ్చినా ఫలితం ఒక్కటే. రికమెండేషన్ వుంటే గాని వుద్యోగం రాదు. అది వుంటే ఎలా పాసైతేనేం. ఎన్నేళ్లకు పాసైతేనేం. ఓనమాలు రాని ఫకీర్లంతా అధికారులు. జీనియస్ లేమో సర్వెంట్స్.

కు: ట్రూ. ఎగ్జాక్ట్లీ ట్రూ. [అంటూ ప్రవేశిస్తాడు]

రా: ఏంట్రా కుమార్. చదువుకున్న నిరుద్యోగుల్ని పోదగడం మన ప్రజాప్రభుత్వపు ప్రధాన బాధ్యతలావుంది. చదువేమో గుమాస్తా చదువు.

కు: నిజమేరా. అయినా ఏం చేస్తాం చెప్పు. వెనకటికి ఎవరో అన్నాళ్ళే. చదువుకోవడం పూర్తి అయితే గాని విద్యార్థి నిజమైన జీవితపు బళ్ళో ప్రవేశించడం జరగడం లేదని.

రా: సర్టెన్ లీ. ఏమైనా గానీ ఓ చిక్కు వస్తున్నది. ప్రిస్క్రైబ్డ్ క్లాస్ టెక్స్ట్సు అనగానే దాని మీద ఇంటరెస్టు నశిస్తుంది. ఇది నాకేనా అందరికీనా అని పెద్ద సందేహం.

కు: ఎవరికైనా అంతేరా బాబూ. టెక్స్ట్ బుక్స్ మెహర్బానీ రాయుళ్ళు వాళ్ళిష్టమొచ్చినట్లు రాయడం, బలవంతంగా మన నెత్తిన రుద్దడం. ఉత్త చెత్త సరుకు తయారవుతుంది. నిజంగా మనల్ని

సంపూర్ణ మానవులుగా తయారుచేసే సాహిత్యం దొరకడంలేదు. ఇదంతా మన ఖర్మ.

రా: ఖర్మ కాదురా భాయ్. మనలో చైతన్యం లుప్తమైంది. మనం తిరుగుబాటు చెయ్యలేక పోతున్నాం. ఇది మనకు ఘోర పరాజయం. అభివృద్ధి నిరోధకులకు విజయం. ఇంకా చెప్పాలంటే మేధావుల ఘోర పరాజయానికి ఇది మహత్తర నిదర్శనం.

కు: ఏదెట్లావున్నా రేపు మన పరీక్షల గండం గడవాలి గదా?

రా: ఏం గండమో. నాకు పాసయ్యే దాకా నమ్మకం లేదు. ఇది "గారంటీ" మాట.

కు: నీ మొహం. వుత్త ఫూలిష్ సెంటిమెంట్ నీది. రోజూ గంటసేపు అయినా చదివావుగదా. నీకేం ఢోకా లేదు. మన కిష్టిగాడి దన్నావ్. వాడు హోప్ లెస్. వాడు చదవడు. ఇంకోడు చదివితే బాధపడ్తాడు.

రా: పూర్ ఫెలో. వాణ్ణి చూస్తే నాకు జాలేస్తుంది. కానీ ఒక విషయం. మనకు అనేక ఆశయాలు, ఆశలు వుంటవి. వాటికో ఆకారం కల్పించాలంటే — మన చుట్టూ వాతావరణం మనకు నిజమైన, సహజమైన ప్రోద్బలం ఇవ్వాలి. ఏమంటావ్ ?

కు: నిజమే కాని ఇందులో ఒక చిక్కు వుంది. అందులోంచి నీవు ఎస్కేప్ కాలేవు. నీవే కాదు. ప్రతి

మానవుడూ అంతే. జీవితం సాల్వ్ కాని క్రాస్ వర్డ్ పజిల్. సాంఘిక న్యాయం ఎప్పుడూ స్వలాభం దృష్టితోనే వుంటుంది అది మానవుని పురోగమనానికి ఒక పెద్ద ప్రతిబంధకం. దీన్ని ఎదుర్కోగల ధీరుల్ని వ్రేళ్ళమీద లెక్క పెట్టొచ్చు.

రా: నేనూ వాళ్ళల్లో లెక్కే.

కు: లెఖ్ఖో, జమో. దానికి స్థిర సంకల్పం అవసరం, టాలా టోలీ వ్యవహారంగా సంఘన్యాయాన్ని వ్యతిరేకిస్తే ఫలితం దుస్సహంగానే వుంటుంది. జీవితం సుదీర్ఘ ప్రయాణం. ఆశయసాధన కత్తిమీదసాము.

రా: కానీవోయ్. అంతిమ విజయం మానవుడిదే. జనం గొర్రెలమంద. జాడ గొర్రె నిజాయితీపైన, మేధస్సుపైన ఆధారపడి వుంటుందిగదా సాంఘిక న్యాయం.

కు: పిచ్చివాడా. మానవుడి జీవిత గ్రంధమంతా అన్వేషణాధ్యాయంలోనే గడిచి పోతుంది. చరమాంకం మృత్యువుతో దుఃఖాంతం అవుతుంది. ఈ సత్యం గమ్యంలేని మహాప్రస్థానాన్ని నిర్దేశిస్తుంది. ఇంతకంటె బృహత్సత్యం ఏముంది.

రా: నీవు నిరాశావాదివి కుమార్. జీవితమనేది ఉన్మాద ప్రక్రియల సంపుటీకరణం.

కు: సరే పోనీ. ఈ గొడవెందుగ్గాని మీ నాన్నగారొచ్చారా?

రా: ఆ, రావడం అయింది; దీవనలు గిట్టడం అయింది.

కు: ఏం? ఏమయిందేమిటి?

రా: నళిని ఫొటో ఆయన కంటపడింది. అసలే ధూమ్రమా త్రుడా! అగ్గిరాముడైపోయాడు. ఎలాగో నానాతంటాలుపడి ఆయనకు మస్కా కొట్టేటప్పటికి చావు తప్పి కన్నులొట్టపోయింది. సినిమా ప్రోగ్రాం వుంది గదూ. అలారం మ్రోగింది. వాడు ఫూల్. సిగరెట్ కూడా కాల్చాడు.

కు: ఆయనెదటే! ఇంకేం. అయ్య పెట్టాల్సిన నాలుగూ అమిరాయన్నమాట.

కి: (ప్రశిపేస్తూ) అమరాల్సిందే బాగా. నే సిగరెట్ కాలుస్తానని చెప్పాడ్రా కుమార్. వీణ్ణి రక్షించడానికి నేనడ్డంపడ్తే ఇంకా నాదే తప్పంటాడు. అయినా వీళ్ళనాన్నగారు మైరావణుడేరా—గిరీశంగారన్నట్లు.

రా: నీబొంద. సినిమా కెడుతున్నాం అంటివి. సమయానికి ఏదో బురిడీ వేశాం గాబట్టి బ్రతికిపొయ్యాం. లేకుంటే ఈపాటికి మనిద్దరం హాస్పటల్లో చేరేవాళ్ళం.

కు: అదీ మంచిదేలే. జల్సాగా—నర్సులూ—వ్యవహారం.

కి: నిజమేరా పరీక్ష బ్బాధైనా తప్పుతుంది.

రా: అఘోరించావ్ గాని. చాలా పొద్దు పోతోంది. ఇహ చదవడమో నిద్రపోవడమో మంచిది.

కి: ఈ అన్ పార్లమెంటరీ వర్డ్సు వినలేక చచ్చిపోతున్నాం. ఎవరో అన్నట్లు.

రా: నీ అన్నట్లు తగలెయ్య. నాకు నిద్రవస్తుంది.

కు : లైట్లార్పరా కిష్టూ. [కిష్టు లైట్లార్పుతాడు]

[స్టేజి చీకటవుతుంది.]

[స్టేజి అంతా చీకటి. గడియారం టిక్కు టిక్కు మని శబ్దం వినపడుతూ వుంటుంది. గోడల నిండా సినిమా బొమ్మలు ]

కి : [లైట్లు వెలిగేటప్పటికి] ప్రొద్దున్నే నిత్యయవ్వని దర్శనం, నా మస్మరణమంచిదే. [గోడ వైపు చూస్తూ] నాన్సెన్స్. బ్యూటిఫుల్ యంగ్ లేడీస్ గోడమీద వ్రేలాడుతుంటే గుఱ్ఱు పెట్టి నిద్రపోతున్నారు ఈ గుల్కాతా శ్రమనాసులు. పరీక్షలో కూడా ఎంత గుండెనిబ్బరం వెళ్ళకి. ముందుగా ప్రిపేరయ్యారు. హాయిగా నిద్రపోతున్నారు. ఇహ నా సంగతో ఆ పరమాత్ముడికే తెలుసు. నిద్రా లేదు–చదువూ లేదు. ఉత్తప్పుడేమో డాన్సులు, నాటకాలు. ఇప్పుడేమో పరీక్షలూ. దిగుళ్ళూ. శ్రీరామచంద్రప్రభూ [పెద్దగా అరుస్తాడు].

రా : (మెల్లగా కళ్ళు నులుముకుంటూ) తెల్లవారిందిరా. గాడ్దలాగా అరుస్తున్నావ్.

కి : తొమ్మిదవ్వచ్చిందిరా బాబూ. వెధవ నిద్ర. ఒరే కుమార్. (తట్టి లేపుతాడు.)

కు : (పడుకోని) పోరా ఫూల్. ఇవ్వాళ కుంభకర్ణుడి తాతలా నిద్రపోవాలి. బ్రహ్మాండమైన కల చెదరగొట్టావ్. డర్టీ గూస్. సెప్టెంబర్ లో పాస్ గాకుండానే లేపావు గదరా.

కి : రాం గాడి నాన్నగారు వచ్చార్రా. లే లే.

కు : ఆ! (చివాల్న లేస్తూ). గుండె ఆగిపోయింది గదరా. కదిలించి మళ్ళీ పెట్టుకోవాలి.

రా: ఏడ్చావ్ గాని కళ్ళంత ఎఱ్ఱగా వున్నయ్యేరా ? కల్తనిద్రా ?

కు : కల్లో గిల్లో గాని బెస్ట్ కల చెడిపోయిందిరా రాం. సెప్టెంబరులో పాస్ అయినతర్వాత మెళుకువ వస్తే బావుండేది.

కి : రాత్రంతా కల్లో మేలుకున్నావు గామాన్లు. దిగులు పడకు. మార్చిలోనే పాసవుదువులే.

రా: అది మన యింటా వంటా లేదు. వంశపారంపర్య హాక్కును బ్రేక్ చేయడం బుద్ధిమంతుల లక్షణం గాదు.

కు : సరేగాని, మీ నాయనొస్తాడేమోరా.

రా: ఆయనొచ్చేది మధ్యాహ్నం రా బాబూ.

కి : ఏమో. పుటిక్కిన దిగుమతయ్యాడా —

కు : ఈ రభస చూసి డంగవుతాడు. వంకెకఱ్ఱతో మన భరతం పడ్తాడు. లేకపోతే రేపు పరీక్షేమిటి ? ఇంత వరకూ హాస్కేమిటి ?

రా: మన బ్రతుకంతా మస్కా కొట్టడంలోనే సరిపోతుంది. తెల్లార్లూ తెగ చదువుతున్నాం అనలేమూ?

కి : వెనకటికెవరో అన్నట్లు — ముందు నిన్ను నువ్వు

మోసం చేసుకో గలిగితేనే, తర్వాత ప్రపంచాన్ని మోసం చెయ్యగలిగేది.

కు : ఎవరో అనడమేం ఖర్మ. తు[illegible].

రా: ఎప్పుడూ వుండేదేగా మన గొడవ కుమార్. ఇక మన ఫ్యూచర్ ప్రోగ్రాం తయారుచేద్దాం.

కు : ఏముందిరా. [illegible] నాటకాలు — డాన్సులు, తినడం — తిరగడం. నువ్వేరా రాం.

రా: నేను పేపరు నడపదలచుకున్నానబ్బాయ్. యువ రచయితల్ని ఎంకరేజ్ చేయడం నా ప్రోగ్రాం.

కి : నిజమేరా. మంచి ఆలోచన. పెద్ద రచయితల పేరుతో వుత్త చెత్త బయట పడుతుంది. కొంతమందేమో శవాలమీద బ్రతుకుతున్నారు.

కు : శవాల మీద బ్రతకడమేందిరోయ్.

రా: డిటెక్టివ్. కాదు డిఫెక్టివ్ నవల్లు వ్రాసి శవాల మీద సొమ్ము చేసుకోవడం. వుత్త చెత్త ఇమిటేషన్. ఇంగ్లీషు నవల్లు మక్కీకి మక్కీ కాపీ గొట్టడం.

కు : ఏమన్నాగానీ మన పత్రికమాత్రం చెత్త ప్రొడ్యూస్ చెయ్యగూడదు. మంచి ఆశయంతో పనిచేస్తే తప్పకుండా లాభిస్తుంది.

రా: నా ఆశయాలన్నిటికీ ఓరూపం నా పత్రికద్వారా ఇవ్వాలని నా కోరిక. సాధిస్తారా భాయ్, సాధిస్తా, లేకుంటే "నా పేరు గిరీశమే, నినదక్షీషణ శంఖము దేవదత్తమే."

కి : ఇంక ఆపండ్రా గొడవ. రేపేగా పరీక్ష మొదలు. తలా తోకా అర్థం గావటంలేదు. ఏం రాయాలో ఏంటో.

కు : ఏదో నీకు వచ్చింది—నచ్చింది రాయరా. దానికో పేస్ట్— .

కి : నీకేరా కడుపు నిండిన వాడివి. చదువుకు చదువూ, డబ్బుకు డబ్బూ. నా గొడవ ఆ ఆది మధ్యాంత రహితుడికే అర్థంగావటంలా. సోదరులారా నేను గ్రూప్ విత్ డ్రా చేసుకుంటున్నా.

రా : అప్పుడే తోకపీకుడు. నీకీ మాయరోగం పోయేది లేదు. నీవు ప్యాసై చచ్చేది లేదు. నేను మటుకు కంప్లీట్‌గా కూర్చుంటాను.

కి : నీకేరా. నాకు గ్రూప్ అనే మాటకే స్పెల్లింగ్ రాదు.

కు : ఒరే కిష్టిగా. నీ ఏడుపే నీకు దరిద్రంరా. తెలుగు అంటావా మాతృభాష. కాల్తో రాసినా పాసవుతాం. హిస్టరీ అన్నావ్ "చెట్లు నాటించెను, బావులు త్రవ్వించెను." ఏం రాసినా మార్కు లేస్తారు. పరీక్షకు కూర్చోరా. లక్కుంటే అదే కలిసివస్తుంది.

కి : కొయ్యవాకురా. పరీక్షరా యిది. లెఖ్ఖా గజిబిజా.

రా : ఊరికినే భయపడతావేరా.

కి : మీ కెంత చులాగ్గా వుందిరా. పరీక్షంటే "ఏదీ గతి నాకు" (ఆలాపిస్తాడు)

రా: గతేంటోయ్ దుర్గతి. పాసైనామా లక్కీ ఛాన్స్. లేదూ యం. యస్. యం. వుండనే వుంది. డోన్ట్ కేర్. నిశ్చింతగా పరీక్షకు పోదాం. పలికిందా కొన్ని పార్ట్సు అయినా పలుకుతయ్. లేదా, పోనీ, మనం కష్టపడ్డాంగా బట్టీ దిగులుపడ్డానికి.

కి : నీ మెట్టవేదాంతం కేంగాని రేపు పరీక్ష ఎగిరిందా మన వీపులు తాపా మర్చాలు మోగుతయ్.

రా: రండోలు మోత మోగనీవోయ్. ఎవడొద్దన్నాడు. కాకపోతే సిగరెట్లకు కొన్నాళ్ళపాటు డబ్బులు దొరకవ్. అంతకన్నా కొంపేమ్మునిగదు.

కు : అసలు సిగరెట్లే మానేద్దాం. ఇంటికీ వంటికీ మంచిది.

రా: నీ బొందమంచి. ది లాస్ట్ పఫ్ ఆఫ్ ఎ సిగరెట్ ఈజ్ ఈక్వల్ టు ఎ ఫస్ట్ కిస్ ఆఫ్ ఎ లాస్. (ఆప్యాయంగా సిగరెట్ వెలిగిస్తాడు)

కు : నీ కవిత్వం చాలుగానీ ఇంతకీ మీ నాన్నగారొచ్చిందెందుకు?

రా: ఎందుకేమిటి. నాకో బెటర్ హాఫ్ ని సప్లై చేయడానికి.

కి : ఓహో! శంకరంగారింటికి అనగానే ఈ జీనియస్ కు అర్థమయిందిలే. కానీ, నా ప్రేమపూర్వక అభ్యర్థన

ఏమంటే — రిజల్ట్సు రాకముందే పెళ్ళి చేసుకో, తర్వాత ఘట్టం క్లయిమాక్సులో వుంటుందా యె.

కు : శుభం పలకరా మంకెన్నా అంటే — దారార్భ గ్యూడా. తొమ్మిదయింది. ఇంకా కాఫీలెప్పుడూ? తిండెప్పుడు? ఈ ఘట్టంలో మీ నాయన కంటపడ్డా మో శిరఃపూజ ప్రాప్తయామి. కాలకృత్యంబు లవశ్యంబు నిర్వర్తనీయంబులు గదా.

(అందరూ లేస్తుండగా లైట్లు ఆరిపోతాయి)

లైట్లు వెలిగేప్పటికి — కామేశం, మహేశం బుజాలమీద చేతు లేసుకుని వుంటారు.]

కా: ఇదేంట్రా డాం కామ్ గా వుంది. మన ట్రూప్ అంతా ఏరి?

మ : నాకేం తెలుసు.

కా: జనంకూడా లేస్తున్నట్టుంది.

మ : మనఖర్మరా భాయ్. మనం వేద్దామనుకున్న డ్రామా —

కా: మనవాళ్ళు వేసేసివుంటారు. ''కాగల కార్యం గంధర్వులే తీర్చిరి'' అన్నాడు— వెనకటి కెవడో.

మ : మన కాపీ రైట్ ?

కా: గంగలో కలిసింది.

మ: కాబట్టే — మన నాటిక కాపీ రైట్ — !

కా: ఎవరు ప్రదర్శిస్తారో వాళ్ళది. ఏలా వుంది మన అయిడియా?

మ : బ్రహ్మాండంగా వుంది.

కా: ఇంతకీ ఎలా వుందో ప్రదర్శన.

మ : రేపు మార్కు లేసిన జడ్జీల నడుగుదాం.

కా: అలావుంది నీ తెలివి. ఇంతమంది జనం ఇంకా-ఇలా కూర్చోనున్నారంటే—

మ : మనవాళ్ళ ప్రదర్శన హాల్ మొత్తం కూడా—

కా: ఆల్ గల్లంతు కాలేదు— అన్నమాట.

మ : బ్రదర్.

కా: ఏం కథ?

మ : దురాశ దుఃఖం చేటు.

కా: ఎందుకని?

మ : ఒకటో రంగంలో మనం తెగ కోతలు కోశాంగదా! ఇంతకీ మనం మైనస్ యాక్టర్ల మయ్యామే.

కా: అని నీ బాధ. బ్రదర్. సూత్రం పట్టింది మనం. మనం లేకపోతే...

[గబ గబా జనంలోంచి ఒక ప్రేక్షకుడు లేచి స్టేజి మీదకు వస్తాడు.]

మ : ఎవరు నువ్వు?

ప్రేక్షకుడు: నేనా? నేను— నాటకం చూడ్డానికి వచ్చిన వాణ్ణి—

కా: ఎవరైనైతే మాకేం. ముఖాన కేక్ లేకుండా స్టేజి మీదకు రాకూడదు.

మ : యాక్టర్ల వాక్కుల్ని భంగంచేశావు.

ప్రే : ఏం ఫరవా లేదు.

కా: ఏమిటి ఫరవా లేనిది?

ప్రే : సహజ సౌందర్యవంతుడ్ని. నాకు కేక్ అవసరం లేదు.

మ : నాన్సెన్స్. మా రూల్సు వప్పుకోవు.

ప్రే : ఇంతేనా మీ డాబుసరి. ఉన్నది వున్నట్లు – వాస్తవం చూపిస్తామన్నారు.

కా: వాస్తవం అంటే ఇలాగా. ఫాక్ట్స్. ఫాక్ట్స్ అంటే సహజత్వం. వాస్తవానికి, సహజత్వానికి అరక్రోసు దూరం. కావాలంటే శంకర నారాయణ జమ్ డిక్షనరీ చూడు.

ప్రే : అంతే మీ బ్రతుకు. మొదట్లో వచ్చారు. తెగ కోతలు – కోతలు కోశారు. మధ్యలో మళ్ళీ మొహం చూపారా?

మ : అదేనయ్యా! టెక్నిక్ మహానుభావా? గొప్ప టెక్నిక్.

ప్రే : సంతోషించాం. ఇంతకీ అసలు సమస్యేంటి? మీరేం సాల్వ్ చేశారు?

కా: డియర్ ఫ్రెండ్స్. అంటే సోదర సోదరీమణులారా. ఇది ప్రజాస్వామ్యయుగం. అంటే మెజారిటీయుగం. మైనారిటీవర్గంలో చేరిన మేం కొంతమంది ఉన్న పరిస్థితుల్ని – జరుగుతున్న విషయాల్ని – అనుభవ పూర్వకమైన వాటిని బయలు పెట్టాము. మీరు

అందరిముందూ వుంచాము. విద్యార్థుల నైతిక ప్రవర్తన ఎందుకుమూరాలో, ఎలా మూరాలో, వారి భావి ఎట్లా రూపొందాలో — ఏం కావాలో నిర్ణయించాల్సింది — మీరు. మీలాంటి పెద్దలు. తెరు వేస్తున్నా మనుకోకండి — మెజారిటీ అభిప్రాయాన్ని బట్టి మేంగూడా నడుచుకుంటాము. ఇది, — సోదరులారా — ఇదంతా ప్రజాస్వామ్య యుగం. మరచిపోవాకండి.

మ : ఓ ప్రేక్షక మహాశయా! ఇంత ఉపన్యాసం విన్న తరువాత మీరు చాలా అలసి పోయుంటారు. ఇక విశ్రమించండి.

ప్రే : అబ్బా ఏం తెలివి? గుడ్ నైట్. (నిష్క్రమణ)

కా : మధ్య ఇదేం గొడవరా బాబూ. అసలే ఛాన్సు పోయిందని ఏడుస్తుంటే.

మ : పోనీరా నాయన్ గాడి టీ నీళ్ళు చేస్నినై ఇంత పని.

కా : డోంట్ వర్రీ. "తానొకటి తలిస్తే దైవం ఇంకోటి తలుస్తాడు."

మ : ఎవరా దైవం? ఏమా కథ?

కా : ఆ కథ చాలా పెద్ద కథ. ఇంకోసారి మాట్లాడ్దాం ఇంకో అరేసుకుందాం పదా.

మ : రెడీ. గెట్ రెడీ — గో.

[నిష్క్రమిస్తుండగా తెర]

Phones - Shop : 954
Res : 978

## [illegible] GENERAL STORES

*Prop :* S. Surya Narasimha Prasad

GENERAL MERCHANTS

MACHILIPATNAM

---

Phone : 81

## Sri Veeranjaneya Rice Trading Company

Proprietor : Dupuguntla Venkateswarlu

*PADDY & RICE MERCHANTS*

శ్రీ వీరాంజనేయ రైస్ ట్రేడింగ్ కంపెని,

పెడన

ప్రొ॥ దుపుగుంట్ల వెంకటేశ్వర్లు

**PEDANA 521 366 Krishna Dt. [A.P.]**

Tel : GOPAL

Phone No 8923

## Sri Venkateswara Rice Mill
## Contractors Company

*Manager :* A. S. R. ANJANEYULU

శ్రీ వెంకటేశ్వర రైస్ మిల్ కంట్రాక్టర్స్ కంపెనీ

మేనేజరు : **A.S.R.** ఆంజనేయులు

**పోలుకొండ,** మండవల్లి తా॥ (కృష్ణా)

---

## M/s Annapoorna Traders

*Paddy, Rice, Brokens, Pulses Merchants*

**6/575, Javvarupet, Machilipatnam**

# వైసు చెల్లించని మూల్యం

( చారిత్రకం )

మూలం:- శ్రీ రాహుల్ సాంకృత్యాయన్

రంగిమామ పాటలు రాసిన, రాస్తున్న

సన్మిత్రులు,

ఆంధ్ర నాటక కళాపరిషత్ కార్యదర్శి,

'నవ్యకవి'

**శ్రీ నాదెళ్ళ పురుషోత్తమశాస్త్రికి**



అంకితం

బూదరాజు శ్యామసుందర్

పాత్రలు :

బుద్ధప్రియుడు

అశ్వఘోషుడు

దత్తమిత్రుడు

అశ్వఘోషుని తండ్రి

ప్రభా

రాసింది:— 1950 సంవత్సరంలో

# ప్రేమ చెల్లించిన మూల్యం

## 1

(నాటకశాల ఆవరణం. అలంకరింపబడిన రంగస్థలం. అశ్వఘోషుడు ప్రవేశిస్తాడు. యువకుడు-కండలు తిరిగిన శరీరం. కళ్ళలో మంచి వెలుగు కనిపిస్తూ వుంటుంది.)

అశ్వఘోషుడు:- బుద్ధప్రియా! బుద్ధప్రియా!

(రంగస్థలం తెర తొలగించుకొని బుద్ధప్రియుడు ప్రవేశిస్తాడు)

బుద్ధప్రియుడు:- ఓహో. అశ్వఘోష మహాశయులకు స్వాగతం. "ఊరకరారు మహాత్ములు." ఏమిటో అంత విశేషం.

అ: విశేషాలకేమిలే మిత్రమా. అలంకరింపబడిన మీ గ్రీకునాటకశాల నన్నాకర్షించింది.

బు: ఇది సర్వసాధారణమైన అలంకరణ మాత్రమే మహాకవీ! నాటక ప్రదర్శన నాడు మరింత శోభాయమానంగా ప్రకాశిస్తుంది — మా రంగశాల.

అ: అవును. మొన్నటి మీ ప్రదర్శన చూచిన తరువాత మా భారతీయ నాట్యకళ ఎంతగా వెనుకబడి వున్నదో తెలుసుకోగల్గాను.

బు: అలా అనకు మహాకవీ! మీ భారతీయ సంస్కృతి, నాగరికత కొన్నివట్ల గ్రీకుల్ని మించిపోతుంది.

అ: అంతా బుద్ధభగవానునిదయ. ఏమైనా మీ నాట్యకళారాధనావిధానం

ఒక ప్రత్యేకమైనది. ఇదంతా చూచినతర్వాత మా భారతీయ రంగాలంకరణ మీ అడుగుజాడల్లో నడవాలనిపిస్తున్నది. మంచిని అనుకరించటం మానవసహజం గదా!

బు: మీ ఊర్వశి ప్రదర్శనం రేపు చూచింతరువాత మీ మా సంస్కృతుల కలయిక మిశ్రమంగానే మిగిలి పోతుందో లేక పూర్తి సంయోగంగా రూపొందుతుందో తేల్చుకోవచ్చు.

అ: ఊర్వశి పాత్ర ఎవరు నటిస్తున్నారు?

బు: దత్తమిత్రుని పుత్రిక — ఆనాడు మీతో పాటు ఈత పోటీల్లో విజయం పొందిందే ఆ ప్రభ — మా గ్రీకుల సర్వశ్రేష్ఠ సుందరి.

అ: ఆమె కా పాత్ర మహోత్తమంగా అమరుతుందని భావిస్తున్నా.

బు: భావించటంకాదు మహాకవీ! ఆమె తనంతట తానే పాత్రను ఏరి కోరి ధరిస్తున్నది. ఆమెతో నటించడం సూర్యుని ముందు దివిటీ అవుతుందేమో అని నా బాధ.

అ: భయపడకు బుద్ధా! నీ వంటి మహత్తర నటకుడే వెనుకకు తగ్గటం నాటక కళకు అవమానం.

బు: నిజమే. నిజమైన గ్రీకుయువకుడు రక్తపాతానికి జంకనట్లే, వేషం కట్టటానిక్కూడా వెనుదీయడు. కాని నా పాత్రను మీరు ధరిస్తే, ఆమె ఇంకా ఉజ్వలంగా రంగంమీద భాసిస్తుంది.

అ: అదేమిటి! మీ సంభాషణ ఇలా మారింది?

బు: ఉన్న మాట అంటున్నాను అశ్వఘోష్. ఆమె మీ ప్రేమకోసం తహ తహ లాడుతున్నది. అందువల్ల ఊర్వశీ వియోగఘట్టం ఆమె హృదయాంతరాళంలోని బాధను వెళ్ళగక్కి సమాజికుల్ని ముగ్ధుల్ని చేస్తుందనటంలో అతిశయోక్తికి తావులేదు.

అ: చూదాం! తినబోతూ రుచులడగడం దేనికి?

బు: మహా కవీ!

అ: పదే పదే మహా కవీ! అనకు బుద్ధప్రియా! ఆ శబ్దం నాలాంటి సామాన్యుని పట్ల ఉపయోగించటం అపచారం అవుతుంది.

బు: వినయం పండితులకు అలంకారమే అయినా అందుక్కూడా ఒక పరిమితి అంటూ వున్నది మిత్రమా! మహాకవి బిరుదం — ఒక్క ఊర్వశీపాత్రచిత్రణకే నీకు దక్కాలోంది. ఇతర రచనలన్నిటికీ-మే మివ్వగల బహుమతి ఏమున్నదా అని మా గ్రీకుల ఆలోచన.

అ: నీ అభిమానానికి కృతజ్ఞుడ్ని మిత్రమా! నా రచనా వ్యాసంగం అంతా ఇక మీద మీ స్నేహ సౌభాగ్య చిహ్నంగానే సాగుతుంది. నా కవిత్వం ఎంతో కృతజ్ఞతా భారంతో తూగుతుంది.

బు: కృతజ్ఞత చూపాల్సింది మేము మహాకవీ! నీ మహాత్మ్యంవల్లనే మా నాట్యకళ సర్వాంగ సుందరం కావల్సి వున్నది. కవికి, నటకునికి వుండవల్సిన అవినాభావ సంబంధమే మిమ్మల్ని మమ్మల్ని దగ్గర చేస్తున్నది.

అ: బుద్ధభగవానుని దయవల్ల మన ఆత్మీయత అజరామరమగు గాక!

బు: తథాస్తు! మళ్ళీ కలుసుకుందాము అశ్వఘోష్. ప్రభాదేవి ఎంతవరకు ప్రదర్శనకు సిద్ధమయిందో తెలుసుకుని రావాలి. నమస్తే! (నిష్క్రమిస్తాడు).

అ: ప్రభాదేవి: నా ప్రభ సంగతి ఇప్పటికి తెల్సుకున్నాడు బుద్ధప్రియుడు. నా ఊర్వశీ వియోగం ప్రభాదేవీ వియోగ సంజనితమేనని అతడూహించ లేకపోవటం విచిత్రంగానే వుంది. ప్రభా — నా ఊర్వశీ ........ (మెల్లగా అచ్చటి ఒక ఆసనం మీద విశ్రమిస్తాడు. కొద్ది క్షణాలు నిశ్శబ్దం. చప్పుడు గాకుండా ప్రభాదేవి ప్రవేశిస్తుంది. లేత యౌవ్వనంలో అప్సర సౌందర్యంతో మెరసిపోయే యువతి. సువర్ణ కేశాలు జాలుగా, నిర్లక్ష్యంగా వదలివేయబడి వుంటవి. మెల్లగా అశ్వఘోషుని ప్రక్కకు చేరుతుంది.)

అ: (నిమీళిత నేత్రుడై) ఊర్వశీ!

ప్రభాదేవి:— స్వామీ!

అ: (కండ్లు తెరచి) ఎవరు — ప్రభా!

ప్ర: అవును స్వామీ! తమ పాదదాసిని.

అ: పాదదాసిని అనకు ప్రభా. నా ఊహాసుందరిని కించపరచకు.

ప్ర: లేదు నా కంత గౌరవమీయవద్దు.

అ: ఎందుకని ప్రభా?

ప్ర: తమ కవితా సృష్టి మార్గాన నాకు దివ్యత్వం కల్గించారు. ఏ నాడో నోచిన నోములకు సత్ఫలితం ప్రసాదించారు. ఇంతకంటే నా స్వామినుండి నేనే మాశించేది? అంత భారమైన ఋణాను బంధంతో నన్ను బంధించకండి ప్రభూ.

అ: గ్రీకు యువతికి తగినట్లుగా నీవు మాట్లాడటంలేదు ప్రభా. స్వేచ్ఛావాయువు పీల్చగల్గిన నీవు బానిసత్వానికి లోబడడం.

ప్ర: ఎందుకు స్వామీ స్వేచ్ఛ? ఎవరినుండి స్వేచ్ఛ కావాలి నాకు? మీ జీవితంలో, కవిత్వంలో పాత్రనై మీ మనస్సుకు ఆనందం కల్గించడానికి — పరిపూర్ణంగా నిండు మనస్సుతో ఆత్మార్పణ చేసు కోవడానికి — అవరోధంగా నిల్చే స్వేచ్ఛ — నాకు వద్దు. నేను భరించలేను. మీఛాయగా, మీ దాసిగా, మీకు పూజారిణిగా నన్ను బ్రతకనివ్వండి. అంతేచాలు.

అ: ఇంత మధురంగా, కవితా ధోరణిలో మాట్లాడ్డం ఎలా అభ్యాస మైంది ప్రభా?

ప్ర: మహాకవుల నిరంతర సాన్నిధ్యంవల్ల సాధింపదగనిది ఏముం టుంది స్వామీ!

అ: ప్రభా! స్త్రీని స్త్రీగా, ఒక నిండు వ్యక్తిగా గౌరవించని మతం

అంటే నా కనహ్యం ప్రభా. అందుకనే నేను బౌద్ధమతావలంబి నయినాను.

ప్ర: కావచ్చు ప్రభూ! స్త్రీకి ఆత్మార్పణగావించడంలో వున్న ఆనందం, తదితరంవల్ల లభ్యం కాదని నా విశ్వాసం.

అ: ఈ విచారణ వదిలేయ్ ప్రభా! నా తల్లి తండ్రులు పూర్తిగా హిందూ బ్రాహ్మణులు. సనాతనాచారాలకు దాసులు. మన కల యిక వారు హర్షించక పోవచ్చు.

ప్ర: పోనీలెండి. మనకు దాంపత్య సౌభాగ్య ప్రాప్తి లేక పోవచ్చు. కానీ జగత్తులో జీవమున్నంతవరకూ మీ కవిత్వం నశించదు. మీ కవితాసుందరినైన నాకూ మరణం వుండదు. నాకింకా కావలసిన దేముంది.

అ: ఎంత త్యాగమూర్తివి ప్రభా! ఈ మతభేదం మన జీవితాలను సుఖపడనిచ్చేట్లు లేదు. కానీ. విధిని ఎదుర్కొందాం. మనం సాధించగల్గింది సాధిద్దాం. ఏమతంలో అయితే ఉదారత లేదో, ఏమతంలో ధన బలాలు ప్రాధాన్యత వహిస్తాయో, ఆ మతం మానవ జాతికి కళంకం.

ప్ర: ఆ మతం నశించక తప్పదు. నశిస్తుంది. అందుకనే మాగ్రికులకు బౌద్ధం అంటే అభిమానం. హిందూమతాన్ని సంస్కరించిన బుద్ధ భగవానుని చరణాలే మనకు ఆశ్రయాలు.

అ: బుద్ధం శరణం గచ్ఛామి. (అర్ధనిమీలిత నేత్రుడవుతాడు).

ప్ర: (భక్తితో నమస్కరిస్తుంది.)

అ: (కండ్లు తెరిచి) ప్రభా! నీ కళ్ళల్లో మాదకత్వం నన్ను పరవశం చేస్తున్నది. నా మనస్సు వశం తప్పుతున్నది.

ప్ర: ప్రణయోన్మాదంలో పడి తమ జీవితాన్ని భగ్నం చేసుకోకండి ప్రభూ. ప్రపంచానికి వెలుగు నీయవలసిన మహాకవులు అంధ కారంలో మునిగిపోతారా?

అ: నీ నేత్రాల్లో వెలుగే నా కవిత్వానికి జీవం పోసింది ప్రభా! నీవు లేని నాడు, నాకు మిగిలేందుకు ఏముంది? ఎడారిజీవితం తప్ప.

ప్ర: యీ ఆదరణ, యీ ప్రేమానురాగాలే నాకు చాలు కవీ! నాలాంటి ఒక సామాన్య వనితకోసం, మీలోని మహత్తర శక్తిని నాశనం చేసుకుంటారా? నా భౌతికకాయం నశించినా నా కీర్తికాయం మీ కవితా ప్రవంతి మార్గాన లోకంలో విహరిస్తూనే వుంటుంది. మీ సాన్నిధ్యంలో, మీ పాదాక్రాంతమై సుఖిస్తూనే వుంటుంది.

అ: నిరంతర సాన్నిధ్యంకంటే ఇతరం నాకవసరంలేదు. ఈ కవిత్వం, కల్పన ఇవన్నీ ఉబుసు పోని క్రియలు. నువ్వు నేనుగా, నేనే నువ్వుగా మారే క్షణంకోసం ఎదురుచూస్తూ జీవితాన్ని తృణప్రాయంగా గడపగలను.

ప్ర: జీవితంలో మధుర క్షణాల కోసం నిరీక్షణమే ఒక రసవత్తర అనుభూతి కవీ! అనంతమైన నిరీక్షణము కంటె ఆప్యాయమైన దేముంటుంది జీవికి?

అ: కావచ్చు కానీ నిరీక్షణ ముగిసినప్పుడేకదా నిజమైనఆనందం ప్రభవించేది ప్రభా! నా యుగయుగాల అన్వేషణమే నీ రూపు — నా ఊర్వశి ఆవిర్భావం. ఆ తపఃఫలితాన్ని స్వంతం కావించుకోవాలనడంలో స్వార్థపరుణ్ణైనా నాకు చింతలేదు.

ప్ర: మీ వస్తువును, మీ మనస్సును, మీ బహిఃప్రాణాన్ని మీ స్వంతం చేసు కోవడంలో స్వార్థం, పరార్థం ప్రశ్న ఏముంది? నా విన్నపంగూడా ఆలకించండి ప్రభూ. నా లాంటి తుచ్ఛ ప్రాణికోసం ఇహ పరాలకు దూరం కావద్దు. మీ బహిఃప్రాణం మాటలకు కొంచెమైనా విలువనీయమని వినమ్రురాలనై ప్రార్థిస్తున్నా.

అ: ఎందుకంత బాధ పడతావు ప్రభా! నీ ఆజ్ఞ శిరోధార్యమే కాని — మత ప్రాతిపదిక కారణంగా మనజీవితాన్ని భగ్నం చేయడం అంటూ జరగడంకన్న ఘోరం ఇంకేముంటుంది. బాధలో గూడా సుఖం

వుంటే వుండ వచ్చు. కాని బాధల్లేని సుఖాన్నే వాంఛించేది — అందుకోసమే నా తపస్సు.

ప్ర: ప్రశాంతంగా ఆలోచించండి కపీ! జీవితంతో, సంఘంతో, పెద్దలాడ్డం అంత సుళువైన పనిగాదు. ప్రతి జీవి సంఘం కట్టుబాట్లకు బద్ధులే.

అ: అలా కాదు ప్రభా. సహనాన్ని అసమర్థతగా గుర్తించే సాంఘిక న్యాయం సహించదగినది కాదు. అలాంటి న్యాయాన్ని ధిక్కరించడం మేధావంతులకు సహజమైన లక్షణం. అదే ఋజుమార్గం అని నా నమ్మిక.

ప్ర: ముందు రేపు ప్రదర్శనం విషయం ఆలోచించండి స్వామీ. మన స్వంత విషయాలకన్నా ఇతరుల విషయంలో కూడా కొంత బాధ్యత తమపై వుంది.

అ: నీవు వెళ్ళిపో ప్రభా! నన్ను వంటరిగా వుండనివ్వు. ఒంటరిగా ఆలోచించుకోనీ.

ప్ర: బాధపడకండి స్వామీ! ఆశతో జీవిద్దాం. ఆశ పువ్వులాంటిది. పండు మాత్రం కాదు. ఆశలు ఫలించక పోవచ్చు కానీ వాటి పరిమళం మాత్రం శాశ్వతంగా వుంటుంది. క్షమించండి. మీకు చెప్పగల్గిన దాన్నికాదు. [దిగులుగా నిష్క్రమిస్తుంది]

అ: ఎల్లప్పుడూ ఆనందంగా జీవితాన్ని గడిపే జీవికి — ఎందుకిలాటి సమస్యను కల్పించాడ్ భగవాన్. కోరికలను జయించమంటారు శాక్యముని. కోరికలను జయించిన వాడికి మిగిలేదేమిటి? శూన్యం. ఛాందసుడైన తండ్రి అంగీకారం లభిస్తుందనే ఆశలేదు. కన్న తండ్రిని ధిక్కరించడమా — ఇలాగే బాధ పడడమా? ఏమి జీవితం? ఎందుకు? [నిష్క్రమణ]

(పూర్తిగా గ్రీకుదుస్తులతో అలంకరింపబడిన దత్త మిత్రుడు ప్రవేశిస్తాడు)

దత్తమిత్రుడు: ప్రభ పూర్తిగా సువర్ణాక్షి సేవలో నిమగ్న మయింది. కాదోయే అత్తగారి సేవలోనే భర్తృసేవా సౌఖ్యాన్ని అనుభవిస్తున్నది — పిచ్చిపిల్ల. అశ్వఘోషుని వంటి విద్వత్కవిని కన్న సువర్ణాక్షి కన్నా అదృష్టవంతులెవ్వరుంటారు.

(బుద్ధప్రియుడు ప్రవేశిస్తాడు. చాలా ఆదాబుదిగా వుంటాడు)

ద: ఏమిటి బుద్ధా! అంతటి తత్తరపాటు. విశ్రాంతిగా కూర్చో.

బు: క్షమించండి దత్తమిత్రా! సువర్ణాక్షిదేవి స్వర్గస్తురాలయింది. అశ్వఘోషుని తల్లి, అతనికి జీవితమిచ్చిన మహాభాగ అసువులు బాసింది.

ద: ప్రభ అక్కడే వున్నది కదూ?

బు: చిత్రం కన్న బిడ్డలా చూచుకునేది మన ప్రభను. అశ్వఘోషుడు పసిపిల్లవానిలా విలపిస్తున్నాడు. ప్రభాదేవి ఊరడింపు కొంతగా ఉపశమింప చేస్తుందని భావిస్తున్నాను.

ద: అశ్వఘోషునికే కాదు — ఆమె అందరికీ — ముఖ్యంగా ప్రభకు తల్లి. ఆమె ప్రేమ వల్లనే ప్రభ యీ నాటికి ఇంతదయినది. ఆమె మరణం మనకందరికీ తీవ్రమైన పరితాప కారణం కాగలదు.

బు: నిజమే. మాతృమూర్తి మరణం అశ్వఘోషునితో పాటు, ప్రభాదేవికీ ముఖ్యంగా నష్టం కల్గిస్తుంది.

ద: అంటే నీ భావం.

బు: తమ పుత్రిక ప్రభ–సువర్ణాక్షిదేవి ఆశ్రయం వల్లనే మహాకవిని భర్తగా పొందగోరింది. ఆమె కూడా అనుజ్ఞ ఇచ్చినది. హఠాత్తుగా ఆమె మరణం ప్రభాదేవి ఆశయానికి గొడ్డలి పెట్టు.

ద: అంతమాత్రానికేనా? ఘోషుని తండ్రితో సంప్రతించి నా ప్రభ కోరిక సిద్ధింప చేస్తాను.

బు: అది అసంభవం స్వామీ.

ద: గ్రీకు ప్రముఖునకు గూడా సంభవా సంభవాలున్నవా ?

బు: క్షమించండి ప్రభూ. గ్రీకు ప్రముఖులైనా తమరూ సాంఘిక న్యాయానికి లొంగవలసినవాళ్ళే. మత భేదం మన ఆశకు అడ్డు గట్ట.

ద: మతం. మతం. ఏమి మతం. దేవుని దృష్టిలో అన్ని మతాలూ ఒక్కటేనయ్యా. జీవితాలు బాగుచేయటానికి మతాలుగాని నాశనం చేయటానికి మతాలెందుకు ? మతాలు మారణాయుధాలు కాగూడదు —

బు: చిత్తం. అది అభ్యుదయకాముకుల సిద్ధాంతం. సిద్ధాంతాలకు, ఆచరణకు చాలా తేడా వుంది. సనాతనులకు ఇవి అర్థం కావు. ఇవి అర్థమైతే వాళ్ళూ అధునాతనులుగా మారుతారు.

ద: శుష్క వేదాంతంవల్ల ప్రయోజనం శూన్యం. కర్తవ్యాన్ని నిర్ణయించు బుద్ధప్రియా !

బు: ముందు అశ్వఘోషుని దర్శిద్దాం. తరవాత మిగిలిన విషయాలు ఆలోచించవచ్చు. ప్రభా అశ్వఘోషులు పిచ్చి వాండ్లలాగున్నారు. దయచేయండి.

(ఇద్దరూ నిష్క్రమిస్తారు.)

## 2

[దత్తమిత్రుని గృహం. ప్రభ ఆలోచనాధీనయై కూర్చునివుంటుంది.]

ప్ర: మాతృ హీనుడైన ప్రియుని శోకాన్ని ఎలా పరిహరించాలో అర్థం కావడంలేదు. మాతృ వియోగినైన నా దురవస్థ నా ప్రియునకు గూడా దాపురించాలా ! ఈ వియోగాన్నే భరించలేని మహాకవి ఇక మీద నా వియోగాన్నెలా భరించగలరో అర్థం కావడంలేదు. ఏమయినా కానీ, ఈ భయంకరమైన బాధలోనించే మహాకవిత్వం ఉద్భవించాలి. అశ్వఘోషుని కీర్తి దిగంత విశ్రాంతం కావాలి.

[తెరలోంచి ప్రభా, ప్రభా అని కేకలు వినిపిస్తాయి]

ప్ర: ఎవరు?

[అంటూ వుండగానే అశ్వఘోషుని తండ్రి ప్రవేశిస్తాడు. సనాతన హిందూవేషం. బ్రహ్మవర్చస్వి.]

ప్ర: తమరా. నాలాటి ఒక క్షుద్రురాలి గృహాన్ని పావనం చేయడానికి వచ్చారా స్వామీ. అశ్వఘోష మహాకవి పితృపాదులు ఆజ్ఞ ఇస్తే తమ పాదాలచెంత వ్రాలదా ఈ దాసి.

అ॥తం॥: ఎంత వినయ వచనాలమ్మా. నీకోసం, నీ వద్ద దయాభిక్ష యాచించడం కోసం వచ్చానమ్మా.

ప్ర: నేను దయాభిక్షనీయగల సమర్థురాలనా స్వామీ. నన్ను కించపరచకండి. తమ ఆజ్ఞ శిరసావహిస్తాను.

అ॥తం॥: ప్రతిగ్రహీత దాతకు లొచ్చుగదా తల్లీ. పుత్రభిక్ష యాచించడానికి వచ్చాను.

ప్ర: అదేమిటి స్వామీ అలా అంటారు. తమకోసం నేనేమైనా చేయగలను. నే చేయదగినదానిని సెలవీయండి స్వామీ.

అ॥తం॥: నా కోరిక విషఫలితాన్ని ప్రసాదిస్తుంది ప్రభా. మాటయిచ్చి తరువాత పశ్చాత్తాప పడి లాభంలేదు. ఆలోచించుకో. ఇంకా అవకాశం యిస్తున్నాను.

ప్ర: ప్రముఖగ్రీకు సామంతుడు దత్తమిత్రుని పుత్రిక ఆడిన మాట తప్పదు స్వామీ. తథాగతుని చరణాల మీద ఆన.

అ॥తం॥: ఇక విను ప్రభా! ఈ రోజు నుంచీ నా అశ్వఘోషుని వీడిపోవాలి నీవు. నా కుమారుని వర్ణసంకరునిగా చేయకు. వాని ప్రతిష్ఠా ప్రాభవాలను వమ్ముచేయకు.

ప్ర: బుద్ధ. బుద్ధ. ఏమిటి స్వామీ. నాజీవిత లతను కూకటి వ్రేళ్ళతోనే పెకలిస్తారా? [గద్గదికంగా] నా ఆశా కుసుమాన్ని మొగ్గ

లోనే గిల్లురారా? నా ప్రాణాన్ని నానుంచి వేరుచేస్తారా? మీకు దయలేదా స్వామి. [నిశ్శబ్దంగా విలపిస్తుంది.]

అ॥తం॥: ముందుగానే చెప్పాను ప్రభా. ఇచ్చిన మాట........

ప్ర: [అర్థోక్తిలోనే] తిరగను. నేను నాశనమైనాసరే. దత్తపుత్రుని పుత్రిక, అశ్వఘోషుని ఆత్మేశ్వరి అడినమాట తప్పదు. మీరు వెళ్ళి పొండి స్వామీ. వెళ్ళండి. (కాసేపు ఆగి) ఎవరి వియోగం అశ్వఘోషుని మహాకవిగా తీర్చిదిద్దిందో, ఎవరి కారణంగా మీ కుమారుని కీర్తి దిక్కులకెగబ్రాకిందో — ఆ కారణాన్నే, ఆ శక్తినే నాశనం చేస్తారా స్వామీ? — ఎంత కఠిన హృదయుడవయ్యా! నీ మతం కోసం, నీ స్వార్థం కోసం చైతన్య ప్రవంతికి అవరోధం కల్పిస్తావా? ఇదేనా? న్యాయం — ఇదేనా? ప్రాణంలో ప్రాణంగా మెలిగిన మా జీవితాల్ని దుమ్ముచేయడానికింతకంటే మహాస్త్రం ఏమీ లభ్యంకాలేదా స్వామీ.

అ॥తం॥: క్షమించు తల్లీ. అర్హ ధర్మం, అర్హ విజ్ఞానం కోసం నా సర్వస్వం ధారపోస్తాను. ఇందులో నా స్వార్థం యేమీ లేదు. యువరక్తంతో కుతకుతలాడే పరిణయోన్మాదులకు ఆ మహత్తర ఉద్యమం అర్థంకాదు. అయిష్టంగానైనా మా ధర్మం కోసం నువ్వు చేసిన మహత్తర త్యాగానికి నా ఆశీస్సులు — సౌభాగ్యవతీ!

ప్ర: ఇంక నాకు ఆశీస్సులెందుకు బ్రాహ్మణస్వామీ. ఎవరికోసం నా సౌభాగ్యం.

అ॥తం॥: అమ్మా నీ బాధ నాకు అర్థమవుతోంది. నీ కర్తవ్యాన్ని నేను తెలుసుకోగలను. నీ మహత్తర త్యాగం ముందు నా ధర్మం తలవంచుతుంది. వ్యక్తిగతంగా నా పరాజయాన్ని అంగీకరిస్తున్నాను. క్షమించు. (తలపాగ తీసి ఆమె పాదాలముందు వుంచుతాడు.)

ప్ర: [నిశ్చేష్టఅయి] ఎంత పనిచేశారు స్వామీ. మీ కోర్కె, ఎంత

దుర్భరమైనా గానీ, ఎంత దుష్టమైనా గానీ, నా స్వామికోసం, నా మహాకవికోసం— నిరపేక్షంగా నెరవేరుస్తాను. వెళ్లండి. నన్ను ఒంటరిగా వుండనీయండి. వెళ్లండి.

[అ॥తం॥ తలవంచుకొని నిష్క్రమిస్తాడు.]

ప్ర: నా వియోగంవల్లనే నా ప్రియునికి మేలు కల్గితే — అదే నా కనుసరణీయం కవీ! మీ పాదాల ముందు ఆత్మార్పణ చేసుకోడం కన్నా మహద్భాగ్యమేముంది. మీ యశస్సు కోసం ఏదైనా సరే చేస్తాను. చేసి తీరతాను. నన్ను మనః పూర్వకంగా ఆశీర్వదించండి. (నిష్క్రమిస్తుంది.)

[కొద్దిక్షణాలు నిశ్శబ్దం. అశ్వఘోషుడు, బుద్ధప్రియుడు ప్రవేశిస్తారు. ఇద్దరి ముఖాలూ విచారసూచకంగా వుంటాయి.]

బు: మహాకవీ!

అ: ఎవరు మహాకవి. మహాకవి మరణించాడు. అశ్వఘోషుడు జీవచ్ఛవం.

బు: ప్రభాదేవికి ఆత్మశాంతినైనా ప్రసాదించవా మిత్రమా!

అ: ఏమిటీ?

బు: ప్రభాదేవి తమకో లేఖ వ్రాసింది.

అ: ఏమిటీ అమరలోకం నించి ప్రభ లేఖ వ్రాసిందా? అవును. నా ప్రభ మరణించినా నన్ను మరచిపోలేదు — ఊర్వశీ —

బు: అశ్వఘోష్. ఆమె తన మరణానికి పూర్వమే వ్రాసింది. మీ వ్యథను అధికం చేయడం ఇష్టం లేక వెంటనే మీకు సమర్పించలేదు దాన్ని.

అ: (ఆతురతతో) ఏదీ. ఏదీ.

బు: (అంగీలోంచి లేఖ తీస్తాడు.)

అ: (పడీగా తీసికొని)

ప్రియ మహాకవీ !

ఎవరివియోగం ఊర్వశీచిత్రణకు కారణభూత మయిందో, ఎవరి వియోగం అశ్వఘోషుని మహాకవిగా లోకానికి ప్రసాదించిందో- ఆ ప్రభ మీకు శాశ్వత వియోగాన్ని బహూకరిస్తున్నది. అంతిమ క్షణాల్లో బహూకరిస్తున్న ఆ మహద్భాగ్యాన్ని మనసారా ప్రేమించి, లోకంలో మహత్తరమైన వెలుగును విరజిమ్మే కవితా వ్యాసంగాన్ని సాగించమని ప్రభ మిమ్మల అభ్యర్థిస్తున్నది. కన్నీటితోనే అయినా అజరామరమైన కవితా రూప తారాక్షణగా విజయంగాంచిన గర్వంతో, సహధర్మచారిణి కాలేక పోయినా సహవాసిగా, అశ్వఘోషుని భావనా ప్రతీకగా, నాట్యకళావిభవశ్రీగా మీప్రభ విలసిల్లినంతకాలం జీవించి, విశ్వకవిగా, గాంధర్వశిల్ప స్రష్ట అశ్వఘోషుని ప్రేరణగా, కలకాలం నిలవాలనే నేడు నిష్క్రమిస్తున్నది. నా కీర్తికండూతి — మీ భావనా పరిధి అనంత విశ్వమయరూపంగా రూపొందాలని ఆకాంక్షిస్తూవున్నది. నాకోసమైనా మీరు విద్వత్కవిలోకంలో ఏకాకిగా, ఒకే ఒకరుగా నిలవాలని, ఏకైకసూత్రులుగా వంద్యులు కావాలని, దత్తమిత్రుని పుత్రికా సాహచర్యం కవితాకన్య సాహచర్యంగా అభిరూఢమవాలని ఆశిస్తూ మీ ప్రభ — మీకు శాశ్వత వియోగాన్ని ప్రసాదిస్తున్నది.

వందన శతములతో —

మీ

ప్రభ.

బుద్ధా ! జీవితంలో ఏది అమూల్యమని? ఏది అగమ్యమని ? మహత్తరమైన భావనా పటిమకు అంకురార్పణ సలిపిన అతిలోకసౌందర్యం అనుకోని రీతిలో అణగారిపోయింది. ఆత్మీయతను అభిమానించలేని,

అనురాగాన్ని అనుభవించలేని, ప్రేమను ప్రేమించలేని అశ్వఘోషుడు ఎంత దౌర్భాగ్యుడు. (అశ్రుసిక్తనేత్రు డవుతాడు.)

బు: దుఃఖించకు అశ్వఘోష్. జీవితగమ్యంలో కళాతృష్ణ ఒక చిన్న సోపానం మాత్రమే. కర్తవ్య విముఖుడవటం కంటే, కింకర్తవ్యావిమూఢుడవటం మేలు. నీ వంటి వేదాంతికి నేను చెప్ప గల దేమి వుంటుంది.

అ: కన్నతండ్రి కఠినత్వం యింతగా పరిణమించడం దాంతికైనా, వేదాంతికైనా దౌర్భాగ్యమే బుద్ధప్రియా. (కోపంగా) ఇలాంటి తండ్రులనెలా గౌరవించగలను.

బు: అపచారం మహాకవీ! పితృదూషణ.... ....

అ: దూషణ.... ఎవరిని దూషించి ఏమిలాభం. ఇంటినిండా నిట్టూర్పు, వంటినిండా బొబ్బలు. బుద్ధా. ఇక నుంచీ వీడు.... సువర్ణాక్షీ పుత్రుడైన అశ్వఘోషుడు. నా తండ్రి అనామకుడు. చరిత్రలో అతడి పేరుకు ప్రసిద్ధి వుండదు.

బు: (ఆశ్చర్యంతో) మహాకవీ! శాంతించు. శాంతించు.

అ: శాంతం.... ఎలా వస్తుంది శాంతం. భగ్నజీవికి. ప్రభా! నా ఊర్వశీ! నీ ఆత్మశాంతికి.... నీ మనోభీష్టసిద్ధికి .... యీ అశ్వఘోషుడు — ఈ నాటినుంచీ సువర్ణాక్షీ పుత్రుడు అశ్వఘోషుడు .... బద్ధకంకణం తాలుస్తున్నాడు. (కళ్ళుమూసుకుని పఠిస్తాడు)

ఓం బుద్ధం శరణం గచ్ఛామి.
ధర్మం శరణం గచ్ఛామి.
సంఘం శరణం గచ్ఛామి.

[తెర వ్రాలుతుంది.]


శుభాభినందనలతో





# బహిష్కారంలో... పరిష్కారం

సారస్వత సేవకు అంకితమైనవాడు
ఒకే రకం మనస్తత్వం గల
మా ఇద్దరిలో ఒకడు
**గుత్తికొండ సుబ్బారావు కు**



ఈ చిరుకానుక

బూదరాజు శ్యామసుందర్

వేషాలు

జీమూతవాహనుడు

సంఘారామాధికారి

ఇద్దరు బౌద్ధభిక్షువులు

రాసింది 1955 లో

1956 లో వి.యస్.ఆర్. కళాశాల

మాగజైన్‌లో ప్రచురితం

# బహిష్కారంతో ...... పరిష్కారం

[తెరలేచేటప్పటికి — అది ఒక బౌద్ధ సంఘారామం. ప్రక్కనే ఒక సుప్రసిద్ధ పురాతన చైత్యకం. చైత్యకం గోడలు బౌద్ధశిల్పాన్ని, సంస్కృతిని ప్రతిఫలిస్తూ వుంటాయి. ఒక గోడను అనుకొని ఒక భిక్షు కూర్చుని వుంటాడు. వయసు షుమారు 30 సం॥లు. గీస్తున్న చిత్రానికి రంగులు దిద్దుతూ వుంటాడు. కాసేపు నిశ్శబ్దం. మధ్య మధ్య తీక్ష్ణంగా చిత్రాన్ని పరికిస్తూ వుంటాడు. ఆ వాతావరణాన్ని ఛేదిస్తూ భిక్షుల ప్రార్థన వినిపిస్తూ వుంటుంది.]

బుద్ధం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి.

(భిక్షు ధ్యానంలో ఏమాత్రం మార్పు కనిపించదు.)

[బౌద్ధ సంఘారామాధికారి ప్రవేశిస్తాడు. వయస్సు 50 సం॥లువుంటాయి. కాని మంచి దృఢకాయుడు సన్యాసివేషం.]

అధికారి: ఏమిటి భిక్షూ — తదేకదీక్షలో నిమగ్నుడై వున్నావ్?

భిక్షు: (ఉలిక్కిపడి) ఓహో! అధికార్లా! నమస్సులు. దయచేయండి.

[శిరస్సు వంచి అంజలి ఘటిస్తాడు.]

అ : ఏదో మహా దీక్షతో నిర్వహిస్తున్నావే?

భి : చిత్రరచన గురుదేవా!

అ : తథాగతుని దివ్యమూర్తేనా నీ చిత్రకల్పన ?

భి : కాదు గురుదేవా.

అ : ధమ్మ పథ సూక్తి లేఖనమా ?

భి : కాదు మహాత్మా—

అ : మరి ఏమిటో తెలియ వచ్చునా నేను ?

భి : అవశ్యం. ప్రకృతి సౌందర్యోపాసన.

అ : [కొంచెం కోపంగా] కాలం వ్యర్థం చేస్తున్నావా ?

భి : లేదు. సద్వినియోగమే చేసుకుంటున్నాను.

అ : ఇంద్రియ నిగ్రహం సాధ్యం కావటం లేదా ?

భి : క్షమించండి గురుదేవ్. తుచ్ఛకామానికి లొంగడంలేదు.

అ : అది నా ఉద్దేశ్యం కాదునాయనా ! అరిషడ్వర్గ జయం భిక్షులకు ముఖ్యం అని తెలియజేస్తున్నాను.

భి : చిత్రం. ఇదివరకే తమరాసూక్తి సెలవిచ్చివున్నారు.

అ : అలాంటప్పుడు........ నీ మనస్సు భౌతిక బంధాల వైపు తిరగడం దోషంకాదా నాయనా ? ప్రకృతిపిచ్చిలో పడి పవిత్ర ధర్మద్రోహం, ఆత్మద్రోహం చేసుకోవచ్చా నాయనా ?

భి : చిత్రకల్పనవిషయంలో నేనలా భావించడంలేదు గురుదేవ్. తమరీ విషయంలో దురభిప్రాయ పడుతున్నారు.

అ : నేనా ! లేదు. నేను చిత్రరచనను దూషించడంలేదు భిక్షూ.

భి : నేను దూషణ భూషణ తిరస్కారాదులను అంతగా లెక్కచేయనని తమకు బాగా తెలుసు ననుకుంటాను.

అ : అవునవును. నిన్నెఱిగిన వారికి కొత్తేముంది ! అయినా నీతో తర్కం అవసరం లేదు నాకు. చెప్పవలె గనుక చెప్పాను.

భి : [అవహాస్యంగా] చిత్రం.

అ : యేదీ ఆ చిత్రం ఒకసారి పరికిస్తాను.

[భిక్షు చిత్రం అధికారికి అందిస్తాడు.]

భి : (చూసి, కోపాశ్చర్యాలతో) ఏమిటిది భిక్షూ— స్త్రీమూర్తి చిత్రణమా? ఎంతటి చేయతగని పనిచేస్తున్నావు భిక్షూ. బుద్ధ ! బుద్ధ !

భి : (వినిపించుకోడు)

అ : పవిత్రమైన తథాగతుని రూపకల్పనల చేత ధరించవలసిన నీవు— అసభ్య చిత్ర సృజనానికై కుంచె చేపట్టావా భిక్షూ! బుద్ధం శరణం గచ్ఛామి !

భి : ఇందులో అసభ్యానికి తావే లేదు గురుదేవ్. ప్రకృతి సౌందర్యా గాధాల లోతుల పరికిస్తున్నాను. రీతులు చిత్రిస్తున్నాను.

అ : (కోపంగా) అబద్ధం. అబద్ధం.

భి : శాంతించండి గురుదేవా.... భిక్షులకు అరిషడ్వర్గ జయం ఆవశ్యకం అని ఇదివరలో తమరే సెలవిచ్చి వున్నారు.

అ : (తలవంచుకొని వినీ విననట్లు) కరుణామయుని ధ్యానంలో మునిగితేలవలసిన నీవు.... ఇలాంటివి చిత్రిస్తున్నందుకు చింతిస్తున్నాను భిక్షూ.

భి : (అవహేళనగా) నన్నుగురించి విచారించడ మెందుకు గురుదేవ్. తమరు తోటి ప్రాణి దురవస్థ సహింపలేరు పావం !

అ : (వినిపించుకోకుండా) భిక్షూ, ఒకే చిత్రంలో ఇంత సౌందర్యం, ఇంత క్రూరత్వం తోపింప చేయడం .... చాలా అన్యాయం.

భి : శాంతించండి మహాత్మా. ఇది క్రూరత్వం కాదు. అమాయికుల మతంపేరిట బలిగొనే స్వార్థ సామాజిక పైశాచిక వికటాట్టహాస విన్యాస చిహ్నం.

అ : (మండిపడుతూ) సమాజం, సంఘం, మతం ! పేర్లు మాత్రం

తెలుసు అందరికి. ప్రతిపురుషుడ్కీ విమర్శన చాతనవు. నిర్మాణ క్రమం తెలియకపోయినా దోషాలెత్తి చూపటం తెలుసు అందరికి. మంచి ఏకొద్ది అయినా గ్రహించటం మటుకు అసంభవం. .... (శాంతంగా) నీలోకినువ్వుచూసుకో భిక్షూ, సత్యం గోచరిస్తుంది. నీ తప్పు తెలుస్తుంది. పశ్చాత్తాపం కలుగుతుంది నీకు.

భి : చిత్తం. అమూల్యం మీ సలహా. నా అంతరాత్మని చంపుకోలేను. (నిమీళిత నేత్రుడై) ఆ రంగులు నా హృదయానికి రంగులు. ఆ మెఱుగులు నా ఆలోచనల్లకి, అభ్యుదయానికి మెఱుగులు........ దోహదం. ఆ భావాలు నా మెదడుకు మేత. అదే నా నిర్వాణ పథం. ఇతరంతో నా కనవసరం. వాటిని నేనమ్మను. నమ్మ లేను. ఇంతకంటే అధికంగా వాగలేను. క్షమించండి.

అ : మాట వినకపోయినా వినయం మాత్రం కావల్సినంత వుంది ! నీ కెలాంటి సహాయం చేయలేను భిక్షూ........ నీ గతికి నిన్ను వదలడం తప్ప. (విసవిసా నిష్క్రమిస్తాడు.)

భి : (విసుగ్గా) వదిలింది పీడ. అహర్నిశం హృదయానికి ఒకటే కోత. మాట్లాడే కొద్దీ గాయం పెద్దదవుతుంది. ఈయన.... పుండు మీద కారం చల్లే రకం. నా గొడవెందుకో వీళ్లకి. నాయిష్టం వచ్చినట్లు నన్నేడ్వనీక. [కాసేపు ఆగి] అన్నీ తప్పులే. కళారాధనే తప్పు. స్వంత మతం తప్పు. దేవుడు లేడనటం మరీ పేద్ద తప్పు. చివరికి మానవుడై పుట్టడం కూడా తప్పే నేమో ! ఈ సంఘారామం ఓ పెద్ద బంధిఖానా. అడ్డూ ఆపూ లేని, కటకటాల్లేని, ఓ పెద్ద బందెల దొడ్డిలా కనిపిస్తుందేగాని— అంతా కట్టు బాట్ల కార్ఖానా.

[తెరలోంచి]

పరిశుద్ధాంతఃకరణకు చావులేదు భిక్షూ. అనవసరంగా బాధ పడకు. ప్రకృతికి ఎదురులేదు. ప్రకృతి జయిస్తుంది. తప్పదు. తప్పదు.

భి : [ఆనందంతో] ధన్యుణ్ణి. ప్రకృతిదేవా ధన్యుణ్ణి. నిన్నూ.... నీ రూపూ ధ్యానించకుండా వుండలేను. నన్ను నీలో లీనం చేసుకోలేవూ.........

[కాసేపు నిశ్శబ్దం. ఇంతలో ఇంకో భిక్షు, ఒక యువకుణ్ణి వెంటపెట్టుకుని ప్రవేశిస్తాడు. యువకుడు చాల అందగాడు. సామాన్యమైన దుస్తులు.]

2భి : యేంటో వదరు తున్నావే భిక్షూ ? భిక్షులకు కోపం కూడదు. తెలుసుకదూ——.

భి : తెలుసు. అన్నీ తెలుసు. తెలుసు గనుకనే ఈ బాధ. తెలీకుంటేనే బావుణ్ణు.

2భి : వికట చెందకు సోదరా.... బోధిసత్వుని అడుగు జాడల్లో ....

భి : [అర్ధోక్తిలోనే] నాకు బోధించకు. నన్ను బాధించకు. నన్ను వేధించకు. నన్ను ఏకాంతంగా వుండనీవోయ్ సోదరా. అయినా నాతో నీకేం పని ?

(యువకుడు ఆశ్చర్యంతో ఇరువురినీ పరికిస్తూ వుంటాడు.)

2భి : పిచ్చివాడా ! ఈతన్ని చూడు. ఇతని పరిచయం నీకు చాలా అవసరం కూడాను. గొప్ప శిల్పి. కవి కూడా. సంసారాన్ని బాసి, మమకారాన్ని రోసి భిక్షుకదీక్షకై వచ్చాడు. ఆదరించి దీక్ష ఇవ్వు. సంభారాలు సిద్ధంగా వున్నాయి. అధికార భిక్షు అజ్ఞ.

భి : (వెదనవ్వు నవ్వి) అజ్ఞ. భిక్షులకు అజ్ఞాపించడంకూడా తెలుసునన్నమాట. పాపం. కానరాని ఖైదులోకి వస్తున్నాడీ అభాగి.

(2వ భిక్షు వినిపించుకోకుండా వెళ్ళిపోతాడు.)

భి : (యువకునికేసి చూచి) ఇలా రా నాయనా —

యువకుడు : చిత్తం. (దగ్గరకు వస్తాడు)

భి : నీ పేరేమిటో తెలియవచ్చా నేను?

యు: జీమూతుడంటారు అందరూ. జీమూతవాహనుడని అసలు పేరు.

భి : భేష్ గుండెల్లో జాలి జావలా పల్చబడేటట్లు చేస్తుంది నీ పేరు— నీ కెందుకీ ఉద్దేశ్యం కలిగింది. ఎవరైనా బోధించారా?

జీ : (ఆశ్చర్యంగా) తమరొక విచిత్రవ్యక్తిలావున్నారు.

భి : ఆశ్చర్యమేముంది నాయనా. కళాకారుడికి తగిన తావు కాదిది. నీ కళకు స్వేచ్ఛ వుండదిక్కడ. నీ భావన్లు, నువ్వు, మబ్బుల మీద తేలిపోలేవు. నీ ఊహ, నీ కళ, నీ సృజనాశక్తి మట్టి పాలవుతుందని హెచ్చరిస్తున్నా.

జీ : ఏమిటి అంటున్నారు మహాశయా. నా శిల్ప నైపుణీ, నా కవితా శక్తి బుద్ధభగవానుని సేవకు అంకితం చేద్దామనుకున్నానే! తరిద్దా మనుకున్నానే!

భి : పాపం! భ్రమపడ్డావు. సహజంగా — నీ కవిత, నీ శిల్పం, ప్రకృతి ప్రతికృతులపైపు దూకినంత సులువుగా భగవానుణ్ణి డాయబోలేదు నాయనా. అందరికీ సన్యాసాశ్రమం శోభించదు. చూస్తున్నావుగా నా అవస్థ. సజీవ ప్రతిమల్లాగ జాతక కథల సృష్టి తప్ప, విశాల ప్రకృతి అందాలకేసి చూడ్డానికైనా అనువు పడదు — ఈ సంఘారామంలో వున్నంతసేపు.

జీ : నేనలా భావించడంలేదు మహాత్మా.

భి : అవును. ఎలా భావిస్తావు. అసలు వీలే లేదు. నీవలా అను కోడానికి. భగవానుని సేవ—విగ్రహాలు చెక్కితే, వాటిల్లో జీవం పోస్తే అబ్బదు. అద్వైతానందాన్ని సాధించు. అయినా దూరపు కొండలు నునుపు గదా!

జీ : (తలపంకిస్తాడు)

భి : నీ స్వాతంత్ర్యాన్ని చంపుకోకు.. నీ వమ్ముడు పోకు. నీ భావ

మేఘాల్ని అరికట్ట ప్రయత్నించకు. నీ స్వేచ్ఛా జీవిత లత త్రెంపివేసికోకు. .... మొదలంటా నాశనం చేసికోకు. స్వచ్ఛమైన, సిస్థరైన కళాకారుడికి మతంతో పనిలేదు. దేవుడితో పని లేదు – ముక్తికోసం తంటాలు అనవసరం. కాని సృష్టి రహస్యాలు తెలుసుకోవలె. వాస్తవాన్ని విస్మరించకూడదు. ప్రకృతి నారాధించడమే భక్తి, ముక్తి, రక్తి కూడ. ఈ నిగూఢసత్యాన్ని మరువకు. మేలు కలుగుతుంది.

జీ : (ఆనందముతో) మీ వాక్కులమూల్యాలు.

భి : హృదయంలో జాలివుంటే చాలు. చేతల్లో మేలు చేస్తే చాలు. వెతల కడ్డుపడితే చాలు. అదే నీకు మహత్తర నిర్వాణపథం. నీకు దేవుడితో, దయ్యంతో పనే లేదు. భ్రమల్లో పడకు. మతోన్మాదుల ప్రలాపాలు నమ్మకు. ఈ వాతావరణం నీ మహా నైర్మల్యాన్ని మలినం చేస్తుంది. నా మాట విను. (బ్రితిమాలినట్లుగా మాట్లాడతాడు.)

జీ : గురుదేవ్ : (అంటూ భిక్షుపాదాలకు నమస్కరించగా భిక్షు ఆశీర్వదిస్తాడు).

(సంఘారామాధికారి, ఇంకో భిక్షు ప్రవేశిస్తారు).

అధికారి : (మూకుడుగా) భిక్షూ, నీపై సంఘద్రోహం మోపబడింది. మరి నీ జవాబు.

భి : (ఆశ్చర్యం నటిస్తూ) నా జవాబా. నే నే తప్పూ చేయలేదే నిజమాడినందుకా ఈ నిష్కారం స్వామీ.

అ : భిక్షూ కోపం తెప్పించకు. దీక్షతో వచ్చిన యువకుణ్ణి దుర్బోధ పాల్చేయడం దోషం కాదా ? బుద్ధభగవానుని చైత్యకం పాదాల చెంత నిలువబడి నిజం చెప్పు.

భి : (వింత స్వరంతో) దుర్బోధా ! నేను చేయలేదే. చేయలేను కూడా అత్యున్నత ఆకాశ శిఖరాగ్రాలను అందుకోమని సలహా యిచ్చాను

అంతే కదూ నేస్తం !

జీ : అవును.

అ : భిక్షూ, నీ మీద మోపబడిన నేరం బహుదొడ్డది. క్షమార్హం కాదు. అందులో మతద్రోహం, సంఘద్రోహం. బుద్ధభగవానుడు నిన్ను రక్షించుగాక !

భి : [మాట్లాడడు]

అ : వీటికి శిక్ష ఏమిటో తెల్సా నీకు ?

జీ : ఏమిటో !

అ : ఏమిటా. నా నాలుకతో ఉచ్చరించలేను.

జీ : ఆ పాపం, ఒకవేళ పాపం అంటూ వుంటే అది ఇంకోడి నెత్తిన రుద్దడానికి ఇది ఒక ఎత్తు గాబోలు. ఏం స్వామీ ! [భిక్షును సంబోధిస్తాడు]

భి : పాపాల భైరవుణ్ణి నేవున్నాగా నేస్తం ! నా నాలుక ఉచ్చరిస్తుంది. సంఘద్రోహానికి శిక్ష సంఘ బహిష్కారం.

జీ : [దిగులుగా] మీకీ బాధ నావల్లనేగా. ........

భి : అంతెందుకు నేస్తం !

అ : [గంభీరంగా] కరుణామయుని దివ్యసన్నిధిని — నిన్ను సంఘారామం నుంచి బహిష్కరిస్తున్నాను భిక్షూ.

భి : (హేళనగా) ధన్యోస్మి. నేనిప్పుడు బలమైన రెక్కలు గల పక్షిని. బోను వదలిన సింహాన్ని. నన్ను బహిష్కరించడంతో మీ సమస్య పరిష్కరింపబడినట్లేనా మహాశయా ?

అ : (కోపంగా) మాతో ఎగతాళా ?

భి : లేదు. దురభిప్రాయపడుతున్నారు.

అ : నువ్వు వెళ్ళాలి వెంటనే.

భి : చిత్తం. కాని — ఓ మనవి.

అ : (అధికార స్వరంతో) ఏమిటది ?

భి : భిక్షుక జనాన్ని మీరు అర్థంచేసుకోలేనన్నినాళ్ళూ మీ సంఘారా మానికి ఇలాంటి దుర్గతి తప్పదు.

అ : (కోపంగా) అనవసరం నీ సలహా.

భి : అమూల్యం మీ ఆజ్ఞ.

అ : నీ కుంచెలు, రంగులు కూడ తీసుకు వెళ్ళు.

భి : సన్యాసికి పాతగోచి తప్పుతుందామరి. రావోయ్ నేస్తం. బలవం తపు సన్యాసం ఇంతే నాయనా ! వెళ్దాం పద.

(సామాగ్రి తీసుకొని జీమూతుడితో పాటు నిష్క్రమిస్తాడు)

(తెరలోనించి)

మతంపేరిట మీరు మడి గట్టుకోని
మానవధర్మాలు మరచిపోయేరు
ప్రకృతి చిత్రము నేర్వరాని శిల్పులకు
స్వాతంత్ర్యమా లేదు ! సత్యమా లేదు !
కళకు చిహ్నము మతాధికార మయ్యేనా ?
లోక వృత్తము దిక్కులేక పొయ్యేనా.

అ : ఆఁ !

(అంటూ విస్తుపోతుండగా తెరవ్రాలింది.)

## తెల్లని మెరిసే పళ్ళకోసం

# జెమిని

## పళ్లపొడి వాడండి















GEMINI CHEMICAL PRODUCTS
P.B No. 7 MACHILIPATNAM 52100
PHONE 877

# మోహిని భస్మాసుర

## పౌరాణికం

[ యక్ష గాన నృత్య నాటిక ]

ప్రఖ్యాత రచయిత, కవి

## కీ॥ శే॥ మల్లాది రామకృష్ణశాస్త్రి

స్మృత్యర్థం



బూదరాజు శ్యామసుందర్

నటకులు, నట్టువరాండ్రు :

సూత్రధారుడు

భస్మాసురుడు

శివుడు

మోహిని

అప్సరసలు

రాసింది 1961 లో

# మోహినీ భస్మాసుర

[తెరలేచేటప్పటికి—త్రిభంగిలో సూత్రధారుని ప్రవేశం.]

ప్రార్థన : వినాయక కవుతము.

నాటరాగం. ఆది తాళం.

ప॥ గణనాయక గజాసుర దమన॥

అ॥ తాండవ నృత్య శుభంకర శంకర
తండు భరత ప్రమథాధి నాయక॥

చ॥ 1. విఘ్నకారకా హేరంబా
శత్రు భయంకర సాంబప్రియా
స్కంద పూర్వజా సాగిలిమ్రొక్కెద
మమ్ముబ్రోవుమా మహిమవెలయగ ॥గణ॥
తారక నాథుని శాపవిదగ్ధుని
సత్యాప్రియుని శ్యమంతకాధిపు
పేర్మితో గాచిన ప్రేమను జూపిన
ఆదిపూజగొను అమృతమూర్తీ ॥గణ॥

2. తాళ జ్ఞానము పదవిన్యాసము
నృత్త చతురత అభినయదర్పం
గౌరీసుత మానాట్య సౌరభం

---

1. తిశ్రజాతి 2. మిశ్రజాతి

నలు దిక్కుల కెగ్రబాకి పోవగా
వరమీయగదే మూషికవాహన ॥గణ॥

[చరణాంతమందు అనుపల్లవి పల్కి, పిదప పల్లవి అనుట అంద మిచ్చును.]

(సూత్రధారుడు పుష్పాంజలి సమర్పించును.)

సూ:- (తూర్పుకు తిరిగి) దేవగాంధారి.

1. లలిత నాట్య ప్రియా, దేవగాంధారి రాగప్రియా, మేఘనాథ వాద్యప్రియా, గజలీల తాళప్రియా, శచీప్రియా : —
2. ప్రాగ్దిశాధినాథా, వజ్రాయుధ ప్రయోగకుశలా, త్రిదశాధిపా, త్రిలోకపూజితా, ఇంద్రా, సురేంద్రా, మహేంద్రా—
3. అమరావతీశ్వరా, అచ్చెరల చెలికాడా, ఐరావతము డిగ్గి అవతరించగదయ్యా —
4. శరణు, శరణంటి, మముగావుమంటి, మహి వెలయుమంటి, ప్రణుతి గొనుమంటి—
దేవగాంధారి రాగప్రియా, లలితనాట్యప్రియా—

(ఆగ్నేయదిక్కు మొగముంచి) నాటరాగం — రూపకతాళం.

ప॥ స్వాగతం సుస్వాగతం
స్వాహాధినాథా స్వాగతం॥

చ॥ ప్రళయమో మరి విలయమో
కనురెప్పపాటులో శూన్యమో
ఆగ్నేయాధిప స్వాగతం
యజ్ఞభోక్తా అగ్నిదేవా ॥స్వాగ॥
వీర విక్రమ తాళమూ
సింహనాద సువాద్యమూ

నాటరాగము తోడుగా
నాట్యమాడెద దేవదేవా ॥స్వాగ॥

శక్తి నీదగు ఆయుధం
కళింగ నృత్తము నీప్రియం
మమ్ముగావుము హవ్యవాహన
స్వాగతం సుస్వాగతం ॥స్వాహా॥

(దక్షిణదిక్కు తిరిగి) కల్యాణిరాగం

ప॥ పాశహస్త శ్యామలాప్రియ
ధర్మదేవత దక్షణాధిప

చ॥ కౌసికీ రాగంబు మేలుగ
సౌదనాద మృదంగ వాద్యము
'ధీం' యనుచూ దిక్కులమరగ
చక్కగా తాళంబు చెక్కలి
నొక్కనట్టుల నిక్కు మిగులగ ॥పాశ॥
కర్తరీ నృత్తమ్ము ఆడెద
మహిష వాహన మమ్ముబ్రోవుము ॥పాశ॥

చిత్రగుప్త చిత్తగించుము
చిక్కుద్రోయక విన్నవించుము
మమ్ముగావగ సన్నుతించెదమూ ॥పాశ॥

(నైరుతిదిక్కు నుద్దేశించి) భైరవిరాగం

ప॥ నైరుతీ నరవాహనా

చ॥ తాళమా రంగప్రదీపము
రాగమా మరి భైరవి
విజయనాదము

పీనులలరగ
విధృతంబుగ నాట్యమాడెద ॥నైరుతీ॥
ఆయుధం మరి కుంతమూ
నివాసమూ కృష్ణాంగన
నిర్మలాత్మ కీర్తి నిలుపుము ॥నైరుతీ॥

(పడమటిదిక్కు చూచుచూ) మేఘరంజని లేక యమునాకల్యాణి.

ప॥ వరుణదేవా కరుణ జూడుము

చ॥ ఉధృతం ఉత్సంగ నాట్యము
మంగళం మకరంద తాళము
మేఘరంజని మేలమాడగ
మిమ్ము బొగడెద మేఘనాధా ॥వరు॥
పశ్చిమం పరిపాలనం
హస్తముల నౌక దండమూ
కళిక దేవితో ఖేలనం
కరుణాంతరంగా గావుమా ॥వరు॥

[వాయువ్యము నుపలక్షించి] వసంతరాగం

ప॥ మహా వాయువా నమస్తే

చ॥ గభీరనాదం, సుగంధ భరితం
సువ్యాపకమూ సుందర నృత్యం
వసంత భైరవి, తంకరితాళం
గంధావటి గంభీర మొనర్చె ॥మహా॥
జానకి శోక వినాశకారుని
అడ్డాలల్లో అలరింపించిన
అంజన దేవీ ఆత్మేశ్వరుడా
అనుమతింపవే పతాకమెత్తెద ॥మహా॥

[ఉత్తరదిశ లక్షించి] శ్రీరాగం

ప॥ తురంగలీలా కుబేరదేవా
కరుణాసాగర ఉత్తరదిక్పతి

చ॥ అశ్వం ఖడ్గం ఆభరణాలట
చిత్రరేఖ నీ అర్ధదేహమట
నలకూబరుడే ప్రియ పుత్రుండట
సంపదలన్నీ నీకు దాసులట ॥తురం॥

సంకీర్ణనృత్తమది నీకు ప్రియంబట
శ్రీ రాగమ్మది పూల హారమట
ధనాధిపతులకె దానమిత్తువట ॥తురం॥

ధనధాన్యంబులు సమృద్ధికాగా
దానగుణంబూ ధర్మవర్తనము
మా కొసంగుమా కుబేరదేవా ॥తురం॥

[ఈశాన్యము పరికించి] భూపాలరాగం

ప॥ భరత శాస్త్ర కర్తా — పార్వతి ప్రియభర్తా

చ॥ దండ పాద నృత్య భంగి
నంది లీల ఆడగా
ఆనంద మందిరి దేవతల్
పదాల కెరగిరి భక్తితో ॥భరత॥

మాతృ కన్నడ చక్కగా
మృదంగ మొత్తెను హెచ్చుగా
పన్నగంబులె స్వరము పల్కెను
వృషభమే భరతంబు చెప్పెను ॥భరత॥

త్రిశూలధారీ ! ఢమరుకహస్తా !
ఫాలలోచనా ! ప్రమధగణాధిప !

కామధ్వంసీ । భరతాచార్యా !
యశోవతీశా ! కైలాసేశ్వర !
మహాదేవ శంభో
మహితాత్మా శంభో ॥

[సభికుల కభిముఖ్యమై]

నాంది : తోడిరాగం

ఆది నటరాజమూర్తికి అంజలించి
గౌరి, ఉషాదేవి, సూర్వసిభజియించి
భరత, నారద, నందీశ, అర్జునాది
భరత శాస్త్రాధికారుల బ్రస్తుతించి
క్షేత్రజ్ఞ, సిద్ధేంద్ర, జయదేవుడాదిగా
పదకర్తలందరికీ బ్రణతులొసగి
గురువు నటరాజా రామకృష్ణాఖ్య
పాదపద్మమ్ము లర్చించి భక్తిమీర
మోహినీనాటకమ్మాడ సంసిద్ధమైతి ॥

ఇవ్విధంబున గణనాథు బూజించి, అష్టదిక్పాలకుల స్తుతించి, రంగ పూజగావించి, గురుపరంపర బ్రస్తుతించి, సదస్యుల బ్రార్థించి, వాద్య ప్రవీణుల సంసిద్ధంబుగా నాదేశించి, నర్తకులకు హెచ్చరికగా, మేమాడ బూనిన "మోహినీభస్మాసుర" యను యక్షగాననృత్య కాలక్షేపంబునకు కథాక్రమంబెట్టిదనిన —

(మృదంగంపై తీర్మానం యివ్వవలెను.)

మును భస్మాసురుడను — పెనురక్కసుడొక్కడు వుండెన్
భక్తితోడ కైలాసవాసునీ — నిత్యము తాబూజించున్॥
"విభూతి ర్భూతి రైశ్వర్యం" అని మనంబున నమ్మిన

వాడై, ఆ యొక్క భస్మాసురుడు ప్రతినిత్యమూ భస్మముతో శివలింగ మొనర్చి — [సంగీతచ్ఛాయతో] శివాయ నమః, శివలింగాయనమః,

భవాయనమః, భవలింగాయనమః” అని శివసహస్రమ్ము జపించుచూ బిల్వదళమ్ములనింపిన భస్మమ్మునేకధారగా మాహేశ్వరార్పణము చేయుచూ కాలంబు బుచ్చుచుండ కతిపయవత్సరంబులకు — [సంగీత చ్ఛాయతో]

“భస్మాంగధారిని భక్తితో నర్చింప
భస్మమ్ము ఎటనేని దొరకదయ్యే ॥
హరహరమహాదేవశంభో (జనఘోష)

అంత నా భస్మాసురుండు ప్రపంచమంతయూ భస్మమ్ముగావించిన తన బూజాదికమునకు అక్కరయగు విభూతికెప్పట్లను గరవురాదను భ్రమ నొందినవాడై —

“పద్మాసనమున సుపవిష్టుండై
భక్తితోడ నాశంకరు శంకరు
పదములనే మదినిల్పి ॥

భవబంధమ్ముల ద్రెంపి, తా
జితమన్మథుడై మించీ
ఉగ్రతపంబున కుంకించీ
సదాశివుని మెప్పింపగనెంచీ” ॥

ఇవ్విధంబున తపోనిష్ఠా గరిష్టుండై బాణాసుర రావణబ్రహ్మాది అసురేశ్వరులమాడ్కి ప్రగాఢ తపోవిష్టుండైన అనంతరకథ యెట్టిదనిన—

(తెరలేచుటతో భస్మాసురుడు తపస్సు చేయుచూ ప్రవేశించును)

ఉగ్రతపోవిష్టులయెడ నయిష్టుండునూ, అమరావతీ పట్టంబున కేమి మొప్పంబువచ్చునోయనెడి భీతి అనిమేషుడయ్యు నిమేషమేని నోర్వక భస్మాసురుని తపోవిఘ్నంబుగావింప నచ్చెరలనియోగించె నంత —

(కిలకిలానవ్వుచూ అచ్చెరలు ప్రవేశింతురు. భస్మాసురునికి ప్రదక్షణముగావింతురు. అసురుని తపోనిష్ఠ యేమియూ సడలదు.)

మోహన రాగం ఆది తాళం

ప॥ నీ మనసు తెలిసె లే లేర
మారా సుకుమారా ॥

చ॥ జవ్వనులా యెదుట జపమింక నేలర
చయ్యన అధరమ్ములానగ రా, ర, ॥నీ॥

మా కన్నుల వెన్నెల కనరా
మా చిక్కని కౌగిలి గొనరా
నల్లనయ్యనువు అయినా నే
నొల్లను పో, పో, యననేర ॥నీ॥

ఆడగ రా రా మాతో
మేల్ హొయలు జూపుదుము లేరా
కల్లగాదురా రా, కంతుకేళి ననుగూడగ చెచ్చెరలేరా॥నీ॥

మోహము మించెను గదరా
పుల్కరించె మా యెదలూ
అలరింతు నిన్ను మెప్పించు యింతి, మరుకేళిబంతి
నేనేర ॥నీ॥

(ఒకదేవకన్య) చక్కని చుక్కనుర
మదికెక్కిన బోటినిర
వెక్కస మెంచక
అక్కునజేరర
మారా సుకుమార రార
నీ మనసు తెలిసె లేరార
రార– రా– ఇటు చూడరా (ఒక్కొక్క కన్య కికురించును)
నవమన్మధ — భస్మాసుర —
నీ మనసు తెలిసె లే లేర ॥

మన్మధ బాణంబులను బోలిన ఆ అచ్చెరకన్నెలు, ఆ రక్కసు నొంవ

నేరక సిగ్గున దిగ్గున పలాయనము చిత్తగింప, జితమన్మధుడైన రక్కసుని తపోశక్తి "ఓం" కారనాదరూపంబున కైలాసంబున ప్రతి ధ్వనింప ఆ సదాశివుడు అనందమగ్నత సంధ్యాతాండవంబాడదొడంగె॥

(తెరలో – గంగాతరంగిణీ శ్లోకము పాడవచ్చును)

"శ్లో॥ గంగాతరంగిణీ కమనీయ జటాకలాపం
గౌరీ నిరంతర విభూషిత వామభాగం
నారాయణ ప్రియ మనంగ మదాపహారం
వారణాసీ పురపతిం భజవిశ్వనాధమ్ ॥"

(రంగస్థలము రెండుభాగములుకాగా ఒక చివర భస్మాసురుని తపస్సు మరియొకలెంక శివతాండవము జరుపవలెను. లేదా భస్మాసుర డొకపక్క ఆసీనుడై యుండ అతని వెనుక తెరలేవగ శివతాండవము ప్రదర్శింపతగును.)

సంధ్యాతాండవం

(అనుపల్లవిని పల్లవిగా పాడుటసుఖము. నేపధ్యంలో పల్లవిని మంద్రస్థాయిలో పల్కవలెను.)

శంకరాభరణరాగం ఆదితాళం

ప॥ ఓంహర హర హర హర శంభో

అ॥ ఫాలలోచన పన్నగభూషణ ప్రమధాధిప శంభో ॥

చ॥ నంది భృంగి శివశక్తి గణమ్ములు
హిరణ్యగర్భుడు, హేరంబుండూ
హృషీకేశుడూ, వజ్రాయుధుడూ
తండు భరత భరతాది భక్తులూ
హర హర హర హర శంభోయన
తాండవమాడే నటరాజమూర్తివి ॥ఓం హర॥

అచ్చరలెల్లరు అలరింపగనూ
యక్షకిన్నరులు "హా, హా" యనగను
హిమగిరితనయ "ఓ, హో" యనగను
మృదంగ నాదము, ఢమరు ప్రతిధ్వని
దిక్కులు ప్రిదులగ దివ్యలు పాడగ
దిశాధి నాథులు దిగ్భ్రమ చెందగ
దంఠ పాదగతి తాండవమాడే
త్రిశూలధారీ, త్రిపురమర్దనా
ఇందుభూషణా, సాంబశివా ॥ఫాల॥
ఫాలలోచన, పన్నగభూషణ, ప్రమథాధిప శంభో॥

సూత్ర:- భస్మాసురుని తపోగ్ని కైలాసంబునంతయు "ఓం" కార రూపంబున నావహింప —

భక్తికి మెచ్చిన శివుడంతట తా
ప్రత్యక్షముగా దలంచె
భస్మాసురుని అనుగ్రహించీ
వరమీయగ నుంకించే ॥

[శివుడు ప్రత్యక్షముకాగా భస్మాసురుని స్తుతి]

భస్మాసురుని శివస్తుతి

1. శివా! మహాదేవశంభో! మహాకాళనాథా! మహేశా! సురేశా! కైలాసవాసా! మహోగ్రస్వరూపా! మహాశాంతమూర్తీ, మహాసత్త్వ తేజోనిధీ! మహాదేవశంభో! శివా —

2. కామ విధ్వంసీ, కపర్దీ! సురేంద్రాది దేవాది దేవార్చితా, మహాభక్త సంసేవ్య సంపూజితా, జితేంద్రా, శరశ్చంద్ర ఆదిత్యనేత్రా విభూషా, మహాదేవశంభో! —

1. భీంపలాస్ 2. అఠాణ

3. లోకైక భరణా, పన్నగా భరణా, కరుణా ప్రపూర్ణా, త్రిపురవిధ్వంసీ, గజచర్మధారీ, కపాలాదిమాలా విభూషా, గౌరీశ, ఈశానసా, లింగ స్వరూపా, 'ఓం' కార నాదప్రదీప, నిఖిలాండకోటిన్, సృజింపన్, లయింపన్, సుస్థితి యొనర్పన్, మహాశక్తినిం గల్గువాడా, మహాదేవశంభో, మహాకాళనాథా! ——

4. రక్షస్సులందరున్, నీ పాద ధూళికై, నిన్ను నర్చింపరే, నిన్ను ప్రార్థింపరే, నీ కతన, గోర్కెలంబొందరే, నిన్ బొగడ, నేనెంత వాడన్, దయాశీలి, శంభో, మహాదేవ శంభో, మహాకాళనాథా! ——

5. విభూతిన్ ప్రసాదించి, కండూతి ద్రోయించి, నా హస్త సంస్పర్శమాత్రాన, సర్వమున్, ధూళిగా, బూదిగా, నే, చేయగా జాలు, శక్తి పూనింపవే, కామితం దీర్పవే, —నిన్ను, నేవేడెదన్, నిన్గూర్చి, పాడెదన్ ——

6. త్రిలోకాధినేతా! త్రిశూల ప్రపూతా! ముక్కంటి — నన్ బ్రోవుమయ్యా, యథాశక్తి బూజింతు, సర్వస్వ మర్పింతు, సకల భక్తావళీ సంతోషకారా, మహాదేవశంభో, మహాకాళనాథా! నమస్తే, నమస్తే, నమః॥

సూత్ర:— స్పర్శమాత్రనే జగత్తునంతయు
విభూతి చేసెడు శక్తి
తనకొసంగుమని అసురుండంతట
శివు పాదమ్ముల నొరంగే॥

మహత్తరమ్మౌ వర మిది భక్తా
ఏరికి నే నీ నొల్లన్
కడు జాగ్రత్తతో మసులుకొమ్ము నీ
కగు శుభములటంచున్॥

---

3. తోడి 4. షణ్ముఖప్రియ 5. కమాచి 6. ఆనంద భైరవి

దేవ దేవుండు భక్త త్రాణ పరాయణుండగు భోలా శంకరుండగుట, అసాధ్యంబునూ, నిఖిల జగద్భంజకంబునూ అయిననూ, మహో గ్రతపంబునకు మెచ్చియుంట భస్మాసురుని అభీష్టసిద్ధిగావించి కైలాసంబునకు తిరోహితుండగు నవసరమున —

అంతట నసురుడు వరదానమ్మున
మిక్కిలి సంతోషించీ
పిపీలికాదుల భస్మము చేసె
పోతరించి గర్వాన ॥

వరమహిమ కుబ్బి తబ్బిబ్బై కొట్టుమిట్టాడుచూ, అతిశయంబున దన్ననుగ్రహించిన శివునే నిగ్రహింపనెంచి, మద్యంబుగ్రోలిన మదమాతంగంబుమాడ్కి, ఆహారాన్వేషకై గర్జించు హర్యక్షంబు భంగి, వీరంగవాద్యంబున నృత్తమాడు ఛండాలు పోల్కి —

వరగర్వంబున నిక్కి, కైలాసముదెసగాంచీ
పక పక నవ్వుచు భస్మాసురుడు
నిటలాక్షున్ క్షయుజేయన్
చెంగున దుమికెను
గంగాదేవిని శిరమున దాల్చిన
సదాశివుని వెనువెంటన్ ॥

భస్మాసురునీ మోసమెఱింగీ
శివుడంతట భయముననూ
తల్లడిల్లుచూ పలాయనంబు
చిత్తగింప నుంకించే
బెదరిన లేడిని వ్యాధునట్టులా
శివుని వెంట అసురుండూ
పరగుదీయగా కని హరి నవ్వున
మోహిని వేషముదాల్చె
రంగంబున కరుదెంచె ॥

(సంభ్రమమున శివుడు తల్లడిల్లు చుండగా మోహిని ప్రవేశించును. మోహినిని చూచి భస్మాసురుడు ఆశ్చర్యమున పరికించుచుండును.)

మోహిని ప్రవేశ దరువు

ఖరహరప్రియ లేక షణ్ముఖప్రియ తాళం: ఆది

ప॥ మోహిని తా వచ్చెనూ

అ॥ మోహిని తా వచ్చె — మెరపూ దీవియవోలె ॥

చ॥ చెక్కిట చేయుంచీ, పుక్కిట నగవుంచీ
చక్కని చుక్క తా చుక్కలా సొబగుమించ ॥మో॥

అక్కజా పడిరి అచ్చరూలూ
నిక్కిచూచిరి రాక్షసూలూ
చెక్కినా శిల్పమ్ము తీరుగ
చక్కదనముల కుప్ప మోహిని ॥మో॥

పసిడి వన్నె పలుకు తీయన, పరిమళాల్ విరజిమ్ము చుండెను
సొంపుగాంచిన కీల్జడా
చెంపలా చారేడు సిగ్గులు ॥మో॥

అరాళగతితో అడుగులిడుచూ
అలరుబోడీ అడుగుడెంచూ
అందచందము లతిశయిల్లా
అలరుచూ, అలరించుచూ ॥మో॥

ముక్కోటి దివ్యులు ముదముచెందగ
మూడుకన్నులవాడు మురియగ
ఆది విష్ణువె అవతరించెను
మోహినీ నామాన జగతిని ॥మో॥

పెంచుకొనినా ఆశతో
వగలెంచకా మోహమ్ముతో

ప్రాణమే పణమొడ్డినా
అసురునీ స్వర్గాని కంపగ ॥మో॥
కామధ్వంసికి కోర్కెలేర్పడ
కన్నులే కల కలా మనగా
వన్నె చిన్నెలు చూపుచూ
వగలాడి మోహిని వచ్చెనూ ॥మో॥

(మోహాంధుడగు భస్మాసురునితో మోహిని]

అఠాణా రాగం ఆదితాళం

ప॥ నవమోహనాకార రార

అ॥ నీపై మరులు దవిలిన దాన నే నేర

చ॥ కౌగిలీనే గోరి సరగున వచ్చితి
కోరీ అక్కున జేర్పు అనుకంప మీరగ ॥నవ॥
సిగ్గు యెగ్గుల విడచి మ్రొక్కితి నీకేర
చిక్కు బెట్టకునన్ను చింతల కాయాకు ॥నవ॥
కలువకన్నులదాన, చెలువూ మీరినదాన
వలపునేరినదాన, వగలాడి నీదాన ॥నవ॥
చిలిపిచూపులదాన చిలుకూహోయలదాన
పొలికింతు పొయ్యారం, కులుకూ తళుకూలతోడ ॥నవ॥
రట్టుచేయకు గుట్టూ, బెట్టూచేసిన వట్టూ
కట్టడీగ కామకేళి చుట్టూముట్టేద నిన్నూ ॥నవ॥
బాలరా, నే డేలరా, నను ఏలరా, నీదానర
ఏలరా, దయగానరా, ముదమూరగా
పలుకాడర, ప్రియమూరగ, తమిదీరగ,
మరిచూడర, బిగిపీడర — నే మోహినిన్ ॥

సూత్ర: మోహాంధుడైన భస్మాసురుని విలాసోన్మత్తతకు చిరునవ్వు

చిందించుచూ పరవశంబు గల్పించి ప్రాణంబులుగొన సంకల్పించి మోహినీదేవి భస్మాసురుని గికురించు విధంబెట్టిదనిన —

(మోహిని భస్మాసురునితో)

శహన లేక మాల్కోస్‌రాగం జంపెతాళం

ప॥ మగనాలిరా నేనూ — మరులూ జెందగ రాదూ
మానినికి భూషణమూ — మానమె గదరా

చ॥ చెలులతో చెరలాట లాడుట తగవుగాదూ
అలనాడు రావణుడూ అంతరించగలేదె ॥మగ॥

పరకీయనూ నేనూ పలుకాడగలేను
అభిసరింపగ రానూ సిగ్గొకటి చీకు పరచూ ॥మగ॥

మోహముంచినవాడ నగుమోము గలవాడ
నాట్య మాడుము నాతో నీయంత నుండేద ॥మగ॥

కామమోహాల్ మది గలంచెను
కుతుక మయ్యది కూడి పొసగెను
సరగునా నాదరిని జేరుము
సరసూడ సంభ్రమింపక ॥మగ॥

కురులయందము జూడు
కులుకు వాల్కడా నొందగు
నామీద నేయాన నాకూ కౌగిలీనొసగూ ॥మగ॥

("కురుల యందము జూడు" చరణము నుండి భస్మాసురుడు మోహిని కలిసి నాట్యమాడుట, "నామీదనేయాన" యనుటలో తన హస్తము శిరము పైనుంచుకొనుట, భస్మమగుట సంభవించును.)

[ఆనందముగా శివుడు ప్రవేశించును]

సూ: పేరాశకు బోయిన అసురుని ప్రాణము
కాలాంతకు చెంతకుపోగా

అతిముదమున నిటలాక్షుడెంతయో
పొంగిపోయె డెందాన

అనంతరంబు నవయవ్వన లావణ్యంబున హాసుమీరు నా జగన్మోహిని నాలోకించి, ఆదివిష్ణువవతరించిన విధంబు మదినెంచక కందర్ప దర్ప నిర్వాసుండయ్యు కాలవశంబున మన్మథాగ్నికీలల మ్రగ్గుచూ, విధి చోదితుండగు పామరుని మాడ్కి జగన్మోహిని సుందర కటాక్ష వీక్ష శలభంబయగుచు మోహినినుద్దేశించి —

నారీరత్నమ నన్నుగూడుమిక
నవరోధము తొలిగెనుగాదా
గౌరీనాధుడ అర్ధదేహమున
నిలుపుకొందు ఇక నిన్నే —

అని పరిపరి విధంబుల నావిధ ప్రార్థింప శివ మనో మోహిని జగన్మోహిని చిరునగవున —

మోహిని:— (శివునితో)

దర్బారురాగం ఆదితాళం

ప॥ నటనమాడు నటరాజ — నాతో

చ॥ సప్తవిధంబుల తాండవ మాడుచు
దండపాద ధృతి నృత్త మొనర్చుచు
ఊర్ధ్వనృత్యమును విలాసమ్ముగా
ఊహాతీతముగాగ నాడెదట ॥నటన॥

ముప్వాల కదలిక జతులు పల్కగా
గ్రీవా భేదము గతులు జూపగా
సాత్త్వికాభినయ మింపొనరింపగ
ప్రచండతాండవముద్ధతి నాడుము ॥నటన॥

(శివమోహినిలు తాండవమాడుదురు)

సూ: శివతాండవంబున కమితానందమొంది మోహిని ఫాలాక్ష పజ్జకు జేర, నామెయె గౌరిగ, మోహినిగ, హరిగ గోచరించుట నత్యంత సంభ్రమంబునగాంచిన, మోహిని శిరంబువంచి నటరాజమూర్తికి నంజలించి—

మోహిని : 

శ్లోకం : "అంగే విరాజద్భుజంగం
అభ్ర గంగా తరంగాభిరామోత్తమాంగం,
"ఓం" కార వాటీ కురంగం
సిద్ధ సంసేవితాంఘ్రిం, భజేమార్గబంధుం ॥"

సూ: అని భక్తిమీర హరి హరునకు మ్రొక్క ఆదిమధ్యాంతరహితుండగు నా పరమేశ్వరుడు. నటరాజభంగి సర్వజగతి రక్షింప నభయముద్రం బట్టిన — (దివ్యులు నాట్యమాడెదరు.)



మంగళం

ప॥ మంగళం నాట్యాధి దేవత
మంగళం జయమంగళం ॥

చ॥ మంగళం భస్మాంగధారికి 
మంగళం నవమోహినికినీ
మంగళం మహితాత్ములందరికీ ॥మంగళం॥

మంగళం గణనాథతనయుకు
మంగళం మన భరతమాతకు
మంగళం మా నాట్యశాలకు ॥మంగళం॥

మంగళం పదకర్త శ్యాముకు,
దరువునేర్పిన రామకృష్ణకు
శుభము లిచ్చే దేవదేవుకు
సర్వజనులకు మంగళమ్
జయమంగళమ్ ॥

# స్పందన బిందువులు

| | |
|---|---|
| ఇంద్రగంటి వెంకటరావు | విశాఖపట్టణం |
| రెంటాల సంజీవరావు | విజయవాడ |
| మహమ్మద్ ఇస్మాయిల్ (కల్పనా ఛటర్జీ) | మచిలీపట్టణం |
| ఆర్. కె. నరసింహారావు | విశాఖపట్టణం |
| కె. యస్. వి. కె. శాస్త్రి | మచిలీపట్టణం |
| బి. యస్. ఆర్. ఆంజనేయులు | ఒంగోలు |
| సి. నారాయణరావు | మచిలీపట్టణం |
| పి. జగన్మోహనరావు | ,, |
| టి. ఉమామహేశ్వరరావు | విజయవాడ |
| సి. యన్. రంగస్వామి | మచిలీపట్టణం |
| చావరాల బ్రహ్మానందరావు | ,, |
| ముసునూరి జగన్నాథరావు | ,, |
| పి. యస్. యన్. శాస్త్రి | హైదరాబాదు |
| దింటకుర్తి అచ్యుతరావు | మచిలీపట్టణం |
| జి. ఆర్. కె. జగన్నాథరావు | ,, |
| బి. కృష్ణమూర్తి | ,, |
| పి. వి. ఆదిశేషు | మంచిర్యాల |
| సోమంచి యజ్ఞన్నశాస్త్రి | బొంబాయి |

| | |
|---|---|
| పరుచూరి నాగేశ్వరరావు | విజయవాడ |
| కల్చరల్ క్లబ్, పున్నమ్మతోట | ,, |
| టి. యస్. యస్. సుబ్బారావు | మచిలీపట్నం |
| సిహెచ్. వి. సుబ్రహ్మణ్యశాస్త్రి | అద్దంకి |
| పెంటెం రవీంద్రరావు | హైదరాబాదు |
| కనకమేడల మాధవరావు | మచిలీపట్నం |
| చలమలశెట్టి శేషగిరిరావు | ,, |
| దివాకర్ల వెంకటేశ్వర్లు | ,, |
| భావరాజు నరసింహారావు | ,, |
| భాగవతుల కుటుంబరావు | ,, |
| పెళ్ళకూరు జయప్రద | నెల్లూరు |
| వై. జె. సోమేశ్వరరావు | మచిలీపట్నం |
| బి. శంకరశాస్త్రి | ,, |
| యస్. లీలావతి | ,, |
| దోరడ్ల రాధాకృష్ణమూర్తి | ,, |
| వడ్డి బాబూరావు | విజయవాడ |
| దేవరాజు వెంకట సుబ్బారావు | మచిలీపట్నం |
| కావూరి రాధాకృష్ణమూర్తి | ,, |
| యస్. వి. సుబ్బయ్య | ,, |
| వి. పూర్ణచంద్రరావు | వరంగల్ |
| కె. వాణీపతిశాస్త్రి | మచిలీపట్నం |
| ఆర్. కోటేశ్వరరావు | ,, |
| ఐ. వి. రావు | ,, |
| యం. ఏ. పద్మనాభరావు | ,, |
| మద్దుల రామచంద్రరావు | మచిలీపట్నం |
| ఏ. చలపతిరావు | ,, |

| | |
|---|---|
| స్. మూర్తి (విహారి) | కడప |
| ాయణమూర్తి (శాలివాహన) | మచిలీపట్టణం |
| ంద సుబ్బారావు | ,, |
| ంబశివరావు | ,, |
| లక్ష్మి నరసింహ | ఇబ్రహీంపట్టణం |
| ఆర్. స్వామి | మచిలీపట్టణం |
| ర్తి వీరబ్రహ్మం | ,, |
| పగడ ప్రభాకరరావు | ,, |
| జు శ్యామసుందర్ | ,, |
| రామలింగేశ్వరరావు | ,, |
| రరాజారావు | ,, |
| స్. మూర్తి | కాకినాడ |
| కృష్ణవేణమ్మ | ,, |
| విజయలక్ష్మి | ,, |
| పాండురంగారావు | మచిలీపట్టణం |
| ర్తి రామకృష్ణారావు | ,, |
| ది సూరిబాబు | ,, |
| టి నరసింహారావు | అనంతవరప్పాడు |
| ుంధరాదేవి | అవనిగడ్డ |
| . యస్. శర్మ | మచిలీపట్టణం |
| కూచి వెంకటేశ్వర్లు | తెనాలి |
| . కృష్ణకుమారి | హైదరాబాదు |
| ాళ్ళ వెంకటేశ్వర్లు | మైలవరం |
| రి యుగంధర్ | మచిలీపట్టణం |
| సాంబశివరావు | అనంతవరప్పాడు |
| ర రామకృష్ణారావు | మచిలీపట్నం |

# మా రాబోవు ప్రచురణలు

1. పరాధీనులు (కథానికల సంపుటి)
   డాక్టర్ పోతుకూచి వెంకటేశ్వర్లు

2. తెలుగు వెలుగు (వ్యాస సంపుటి)
   శ్రీమతి సి. వేదవతి

3. కథా సంపుటి
   శ్రీమతి ఐ. వి. యస్. అచ్యుతవల్లి

4. గుడ్ మార్నింగ్ (మినీ కవితల సంపుటి)
   శ్రీ రావి రంగారావు

స్పందన సాహితీ సమాఖ్య (రిజిస్టర్డ్)
26-162, బుట్టాయిపేట
మచిలీపట్టణం-521001

Phone : Shop : 697 Res : 25 Gudur

## Ramakrishna Mirror Industries

## రామకృష్ణా మిర్రర్ ఇండస్ట్రీస్

హోల్‌సేల్ అండ్ రిటైల్ గ్లాస్ మర్చంట్స్

ఫోర్ట్ రోడ్, మచిలీపట్నం 521 001

డీలర్లు : సాదా గ్లాసులు, కిటికీ అద్దాలు, చూపుడు అద్దాలు, హార్డ్ బోర్డ్స్, లామినేట్స్, అల్యూమినియం షీటింగ్స్, పాలిష్, గమ్, ఫోటో ఫ్రేములు వగైరాలు.

---

Cable : "Wantaction" Phones : 21980 28497 28956

*Best Wishes from :*

## Satsang Trade Corporation

21, Errabaluchetty Street

POST BOX NO. 2030

MADRAS 600 001

**Importers and Stockists of :**

**SKF Bearings** **Fenner V Belts**

SYAAM NAATIKALU Rs.10/-



బాదరాజు శ్యామసుందర్

జననం : శ్రీముఖ నామ సంవత్సర మాఘ బహుళ పంచమి (4-2-1934)

జన్మస్థలం : ప్రకాశం జిల్లా వేటపాలెం

పట్టభద్రులు - చిత్రగుప్త, నగారా, సినిమా, సుభాషిణి, సంసారం, స్రవంతి, ఆంధ్ర ప్రభ, ఆంధ్ర పత్రిక, ఆంధ్రజ్యోతి, విశాలాంధ్ర, కళ మొదలైన పత్రికల్లో పలు రచనలు వెలువడ్డాయి. కథానిక, నాటిక, వచన కవితా ప్రక్రియల్లో ప్రవేశం వుంది.

సాహితీ సేవా కార్యక్రమాల్లో బాల్యంనించీ ప్రధాన కార్యకర్త.

ఇటీవలే వీరి వచన కవితా కావ్యం "ప్రబుద్ధ భారతం" వెలుగు చూచింది.

ఆంధ్రభూమి, ప్రజా ప్రభ, ఆంధ్రజ్యోతి, దినపత్రికల సంపాదక వర్గాలలో చాలాకాలం పని చేశారు.

1966 నుంచి మచిలీపట్టణం – ఆంధ్రా సైంటిఫిక్ కంపెనీలో ఉద్యోగిగా – స్థిరనివాసం.

Spandana Saahithee Samaakhya Publication No.29



బూదరాజు శ్యామసుందర్

జననం: శ్రీముఖ నామ సంవత్సర మాఘ బహుళ పంచమి (4-2-1934)

జన్మస్థలం: ప్రకాశం జిల్లా వేటపాలెం

పట్టభద్రులు - చిత్రగుప్త, వగారా, సినిమా, సుభాషిణి, సంసారం, స్రవంతి, ఆంధ్ర ప్రభ, ఆంధ్ర పత్రిక, ఆంధ్రజ్యోతి, విశాలాంధ్ర, కళ మొదలైన పత్రికల్లో పలు రచనలు వెలువడ్డాయి. కథానిక, నాటిక, వచన కవితా ప్రక్రియల్లో ప్రవేశం వుంది.

సాహితీ సేవా కార్యక్రమాల్లో బాల్యంనించీ ప్రధాన కార్యకర్త.

ఇటీవలే వీరి వచన కవితా కావ్యం "ప్రబుద్ధ భారతం" వెలుగు చూచింది.

ఆంధ్రభూమి, ప్రజా ప్రభ, ఆంధ్రజ్యోతి, దినపత్రికల సంపాదక వర్గాలలో చాలాకాలం పని చేశారు.

1966 నుంచి మచిలీపట్టణం — ఆంధ్రా సైంటిఫిక్ కంపెనీలో ఉద్యోగిగా — స్థిరనివాసం